# పల్లెటూరు

## సాంస్కృతిక మాసపత్రిక

నందన—శ్రావణము



సంపాదకుడు

## దేవీప్రసాద్



సంగారెడ్డి

15 ఆగస్టు 1952

సాలు చందా రూ. 6-0-0



విడి పత్రిక రూ. 0-8-0

# విషయానుక్రమణిక



---

**ముఖచిత్రము :**

హైదరాబాదు ప్రభుత్వ వ్యవసాయసమాచార శాఖవారి సౌజన్యంతో.



# పల్లెటూరు

## సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి ౧ | నందన - శ్రావణము | సంచిక ౧

## సంపాదకీయము:



# 15 ఆగస్టు



ఆగస్టు 15 వ దినము మనకు స్వాతంత్ర్య పర్వదినము. ఈ పర్వదినము మనకు ఆకవది. స్వతంత్రము వచ్చిన తరువాత జరిగిన ఐదేండ్లలో యెన్నో కష్టములకు గురియైన ప్రజలను పాలకులు తమ సవ్యపరిపాలనమున సంతోష పెట్టజాలకపోయిరి. ఇందుకు కారణమేమిటి? ముఖ్యంగా ప్రభుత్వమున కేర్పడినది ప్రజల ఆహార సమస్య, జీవితసమస్య. వీనిని సరిదిద్దుట లోనే ప్రభుత్వము బాహాటంగా కృషి సలిపి నప్పటికీ, ప్రజా సౌకర్యమున కందుబాటుగాని ఆచరణలోపమున ప్రభుత్వ కృషి తేజోవంతము కాకపోయినది. ఆర్థిక వ్యవస్థ అభివృద్ధి నందజాలక పోయినది. పాలన శాఖల్లోని యధికార వర్గము తమ కర్తవ్యమును గుర్తించకుండుటవలన మాజీ ప్రభుత్వ గులాంలగు కొందరు తమ మనోవైఖరిని మార్చుకొనకుండా లంచాలకు, ప్రజలను వంచించుట కలవాటు పడుటవలన; పెద్ద భూస్వాములు, ధనవంతులు స్వార్థము, ఆశ వీటిని పెంపుజేయుట వలన పెనుబీదతనము, పెద్ద ధనికత్వము పెరిగిపోయినది. అసమానము, ఆందోళనము, ఆరాటము అంతా వ్యాపించిపోయినది, "ఇదేనా మన రాజ్యము" అనుమాట అందరినోట వాడుకైపోయినది.

స్వార్థము,ఆశ ఇవి పోయిననాడే మన
స్వాతంత్ర్య సౌఖ్యమును సమానము
పొందగలిగి, ఆనందమున మనగలుగుదుమ
మన ప్రధాన మంత్రి నెహ్రూగారు ఢిల్లీ
'లాల్ ఖిల్లా' పైని పతాక వందన సమ
మున అన్నారు. అది మనము మ
పాలకవర్గము గుర్తించిననాడే వ
స్వాతంత్ర్య పండుగను సుఖముగా చేసికొ
గలుగుదుము.

ఆచరణపట్ల ప్రజలు పాలకులు అన్యోన్య
సహకారమును వర్తించి బీదల కష్టముల
గుర్తించి కులమత భేదాలకు తావివ్వకుం
ఇది మన రాజ్యము, ఇది మన కర్తవ్యమ
నిస్వార్థమున గుర్తించిననాడే పంచవర్ష ప్రణా
ళికలు, భూసంస్కరణ, భూపంపక విధా
ములు, విద్య, కుటీరపరిశ్రమలు అంతా చక్క
బడును.

నేడు అతివృష్టి, అనావృష్టి బాధలు చె
రేగినవి. కొన్ని ప్రాంతాలలో కరువు సూ
నలు కాన్పించుచున్నవి. కొన్ని ప్రాంతా
లో ఆకలివందులు బయలుదేరుచున్నవి. ఆహా
సత్యాగ్రహాలు, సమ్మెలు చెలరేగుచున్నవి
ప్రజాకోర్కెలు తీర్చగల ప్రభుత్వ పాలనలో

...వన్ని బయలుదేరగల హేతువు ప్రభుత్వము ...ర్తించవలసి యున్నది.

నేడు కంట్రోలు బాధలు తొలగిపోయినవి. ...హారవస్తువులను అమ్మే నికరమైన ధరలు ...లకడగా లేనందున మధ్యరకమువారి బాధలు మరింత ఎక్కువైనవి. పండించుటకు ...గు ఆర్థికబలము పల్లెటూరు రైతాంగము ...కు చేకూరిననాడే అన్నార్తుల జీవనాలకు ...ధారమైన అధిక ఆహారోత్పత్తి సమస్య ...రవేరగలదు. అధిక ఆహారోత్పత్తికిగాను ...పన్న సత్తాగల భూమిలేని రైతుకు భూదాన ...ుసగుటలోనే ఈ దృక్పథము నెరవేర ...లదు. రైతుకు అందుకుతగు ఆర్థిక బలము ...ాడ కావలయును. అప్పుడే అధికాహారో...త్పత్తివలన తినతిండి, కట్టుగుడ్డ లభించగలదు.

15వ ఆగస్టు పర్వదినము మనమంతా ...సికొన్నాము. గతాన్ని స్మరించుకొన్నాము. ...ర్తమానాన్ని భవిష్యత్తునుఆలోచించుకొన్నట్టి ...వితసౌఖ్యము ఈఆరవ ఆగస్టు 15వ స్వాతంత్ర్యదినమైన చేకూర్చగలదేమోయని ఆశించుచున్నాము.

★

## విజ్ఞప్తి

మాపల్లెటూరుకు తొమ్మిదినెలలుదాటి ఈ ఆగస్టు నెలకుంచికవలన పదవనెల ఏర్పడినది. పల్లెటూరు పోషణకు ముఖ్యాధారులైన చందాదారులు తమ చందాలనుపంపి 'పల్లెటూరు'ను కాపాడుదురని కోరుచున్నాము. వీ.పి.లను తిరుగగొట్టక స్వీకరింతురని ఆశించుచున్నాము.

## మా రచయితలకు విజ్ఞప్తి

తమ రచనలను పంపునపుడు ప్రత్యేకముగా తమ సంక్షిప్త జీవితచరిత్ర ఫోటో బ్లాకులు ఉండిన పంపినచో నవంబరు వార్షిక సంచికలో ప్రకటించుకోబడును. పల్లెటూరు కనువగు రచనలను, పల్లెటూరు కనువగు ఆటపాటలను, జానపదగేయములను, కథలను నవంబరువార్షిక సంచికకుపంపుదురని ముందేవిన్నపము చేసుకొనుచున్నాము. సం. 'పల్లెటూరు'

---

## ధన్యవాదములు

పత్రికానిర్వహణలో సహజముగా వాటిల్లుచుండు ఆర్థిక చిక్కులు మా "పల్లెటూరు" పత్రిక నిర్వహణములో గూడ ఏర్పడినందున-

శ్రీ కొండారెడ్డి, ధన్నారము,
శ్రీ సందల్ యల్లయ్యగౌడ్, కోసిగి,
శ్రీ నారాయణరెడ్డి, పులకంటి—గారలు

మాయెడ అమిత ఆదరభావములో, "పల్లెటూరు" పత్రికా పోషకులుగా చేరి, మాకుసహాయపడి, పత్రికా నిర్వహణ కృషికి ఉత్సాహపూరిత వాతావరణాన్ని కల్పించినందులకు, పై మహాశయులకు మాధన్యవాదముల తెల్పుకొను చున్నాము.

—సంపాదకుడు "పల్లెటూరు"

 

# స్వరాజ్యసోదె



శ్రీ యం. జయరాములు

స్వతంత్ర మొచ్చిందెవ్వారికీ
స్వరాజ్య మచ్చిందెవ్వారికీ.
తెల్ల వారగనె
పశువుల దోలుక
పిల్లన గ్రోవిని
మొల్లో బెట్టుక
చల్లా సంకటి
ఉగ్గము దుత్తా
నల్ల నైన
రెండేళ్ల గోచితో
చేతులో కఱ్ఱా
చొంకనె కుక్కా
ముచ్చటగా నా
పచ్చిక బయళ్లో
కెక్కెర వేయుచు
ఆల మేపెడి
బక్కనయ్యో ఓ!
పసుల కాపరీ! స్వ:



దుర్గో
కానో
దుగ్గాణియొ, మా
అబ్బ తండ్రి
కప్పిచ్చి నాముని
అసలు కంటె
వడ్డే పెరిగిందని
వడ్డి తీర్పుకు
అప్ప నంచుక
అసలు కొలువు సను
పసుల కావరిగ
సిసలు జేసు
కొన్నట్టి
ధొరలకే!
స్వరాజ్య మొచ్చిందీ-
బాబూ
స్వతంత్ర మచ్చిందీ.



చెట్టు గుట్టలను
శిథిలము జేసి
మిట్ట పల్లముల
చదరము జేసి
గట్టిగ నాగలి
మేడి నదిమి, యా
నట్టు బీళ్లను
నలగంగ దున్ని
విత్తులు నానా
విధముల విత్తి
కొత్త ధాన్య
రాసుల పండించి
నిత్తెము లోకపు
బత్తెము నిస్తూ
పస్తులు గడిపెడి
బక్క హాలికా!
స్వతంత్ర మొచ్చిందెవ్వారికీ
స్వరాజ్య మచ్చిందెవ్వారికీ.



కౌలుదార్లను
భూముల నుండి
కదల్చ వద్దని
బదుల్ పల్కకని
కఠినమైన
గస్తీ లటుండ, మరి
ప్రధాన మాత్యుల
ప్రకటనలున్నా
ప్రజానాయకులు
బాకాలూదిన
నాణెల్ నగలో
నజరా నెట్టో
విధ విధముల
విందులు గుడిపించో
సుందరాంగి
పొంగుల మరగించో
తహసీల్దారుల
ఎహసాన్ బడసి
కొల్ల కొల్లలుగ
భూముల నుండి
వెళ్ల గొట్టి
రైతుల నేడ్పించెడి
బల్లలు పెరిగిన
భూస్వాములకు
తిండి పోతు
గుండాముతాలకు
వూసరవిల్లిలా
రంగులు మార్చెడి,
మోసకారి అవ
కాశ వాదులకు
స్వతంత్రి మొచ్చిందీ-
బాబూ
స్వరాజ్య మచ్చిందీ.

——

# పల్లెటూరి పసిమొగ్గలు : ప్రాచీన ప్రాతిపదిక - అధునాతన పంథా

"కోటీశ్వరుడు"

విశాల తెలుగువాణి తన సాహిత్యసౌధంలో వినీల కాంతుల్ని విరజిమ్మే పసిసీమల్ని "పల్లెపల్లెయు సర్వ ప్రపంచ సీమ" అని అఖండగానాన్నిచ్చి సత్కరించింది. ఈ మహత్తర వాక్యాన్ని మరువగల్గటం మానవాళికి సాధ్యంకాదనటంలో సందేహం కించిత్తైనా లేదు- అసలీ వాక్యంలోని యథార్థ వస్తువును పరిశీలిస్తే ఎట్టివారైనా పల్లెటూళ్ళ ప్రాభవాన్ని తేలికగా గుర్తిస్తారని తలపోయవచ్చు.

పురాతన కాలంలో భరతఖండం ఆశ్రమములు కొన్ని ఏర్పరచి వానప్రస్థాశ్రమంలో సంచరుడుగా తిరిగే భాగ్యాన్ని చేకూర్చ ప్రకృతితో మానవుడు మిళితమై యుండేట్లు చేయబడ్డది. కలకలారావాలతో పక్షులు, గలగల పాడుతూన్న ఎండుటాకులపై గంతులిడే లేడి సమూహాలు, ఇత్యాది అనేక వింత శోభలను గూర్చే ఆనంద దృశ్యాలతో అరణ్యాలు నిండి ఉండేవి. ఆ అరణ్య మధ్యభాగంలో అన్ని సౌకర్యాలు లభించే ఒక ప్రదేశంచూచి అటనొక పర్ణ కుటీరం నిర్మించుకొని ఆధ్యాత్మిక చింత చేసికొంటూ పూర్వపు మానవులు తమతమ జీవితయాత్రల్ని ముగించేవారు-

క్రమంగా జనసంఖ్య హెచ్చుగుతూండటం వలన ప్రకృతిని ఆక్రమిస్తూ, అనుభవిస్తూ, ఆధ్యాత్మిక చింతకై పాటుపడటానికి బదులు ఐహిక సుఖంకోసం తెగలుతెగలుగా, గుంపులుగుంపులుగా చీలి యావద్భూప్రదేశాన్ని వశీకరణం చేయ మొదలిడి, వాన గాలిసాలు లభించే తావుల్లో తమతమ నెలవుల్ని స్థిరం చేసికొన్నారు- ఆ విధంగా పల్లెటూర్లు ఏర్పడి ప్రపంచ చరిత్రలో ప్రముఖ పాత్రను నిర్వహించేందుకు పునాదిగా వానప్రస్థాశ్రమ విశిష్టతయే చేకూర్చి పెట్టిందనటంలో సంశయం లేదు-

తినతిండి ఏనాడు లభింప మొదలు అయిందో ఆనాటినుండి తిరిగి కొరతవస్తుందేమో అన్న సంకోచం ఆనాటి ప్రజానీకానికి తట్టింది- ఆహారాన్వేషణ చాలించి స్వయంకృషితో అదే ప్రదేశంలో అవసరవస్తువుల్ని సేకరించుకోగల శక్తిని సంపాదింప సమకట్టారు- ధాన్యమును తిరిగి నేలపైచల్లిన అవి మొలచి పెద్దవై ఫలించి సఫలీకృతుల్ని చేయగా నాటి మానవులు శాలిధాన్యాన్ని పొందగలిగే అదృష్టాన్ని పొందారు-

క్రమేణా విజ్ఞాన వీధిలో మానసిక వికాసంపరువులిడి కృతకృత్యురాలు కాగా వ్యవసాయ విధానం నేర్చుకల్గి సునాయాస ఆహారసేకరణను అనుభవింప కలిగారు, "కృషితో నాస్తి దుర్భిక్షం" అన్న ఆర్యోక్తిని అవగాహన చేసికొని "వ్యవసాయము అనగా ప్రయత్నము" చేసి తొలిప్రయత్నం ఆహారం కోసం చేయబడింది గనుక ఆహార ప్రయత్నానికే వ్యవసాయమని నామకరణం చేశారు నాటి పూర్వులు-

ఈ విధంగా వారు తినతిండిని ప్రదేశాలన్నీ తిరుగకుండా తమ ప్రదేశాలలోనే పొందగలిగే అవకాశాన్ని గ్రహించారు. కొండగుహల్లో కిరాతకులమాదిరి నివసించే విధానాన్ని మంటగల్పి ప్రకృతిసాయంవల్ల ఇండ్లను నిర్మించుకొగలిగినారు. పక్షులు చెట్లపై గూడులు కట్టుచుండుటను చూచి నాటిమనుష్యులు ఊహాప్రపంచంలో ఉపాయాలను ఆలోచించి అదే మాదిరి ప్రాంతమునగల పుల్లపుడక వగైరా వస్తువుల్ని తీసికొని గృహనిర్మాణానికి పూనుకొని కృతకృత్యులైనారు. ఈ మాదిరి ఆనాటివాళ్లు వుండటానికిల్లును కూడా సృష్టించుకోగల్గినారు. అనగా ఆపల్లెలేర్పడే అవకాశం ఇండ్లకట్టడంద్వారా లభ్యమైంది.

అదేమాదిరి వస్త్రాన్వేషణకై ప్రకృతిని పరిశీలింప ప్రారంభించి సాలీడు, పిచ్చుక మున్నగు ఇతర ప్రాణికోటినుండి అల్లికవిధానం అన్వేషణతో సాధించి తెలిసికొని వస్త్రములు నేయదగువిధానము, కావలసిన ముడిపదారాలను ఎంచుకొని వస్త్రధారులు కాగలిగి

వనచర నిశాచరత్వాన్ని ఆనాటి ప్రజానీకం రూపుమాపుకున్నారు.

అప్పటినుండి పల్లెటూళ్ల ప్రభావం ప్రఖ్యాత పాత్రను ప్రపంచంలో వహింపగలిగే మహద్భాగ్యం చేరువలో పడింది. మానవుని మనోవికాసం అనేక పిపాసల పరువులిడి అంతులేని విభవాస్పదవస్తుసముదాయాన్ని పొందగలిగేందుకై ప్రాకులాడింది. క్రమక్రమంగా గత విషయాల్ని మననం చేసికొంటూ ప్రస్తుతసంగతుల్ని పరిశీలిస్తూ భవిష్యత్తునుకూడా చిత్రించుకోగలిగే మహత్తరశక్తి లభించింది. ఈ అపూర్వభాగ్యం భారతదేశానికే దక్కిందనటంలో అతిశయోక్తి లేదు. దానికి తార్కాణంగా పురాణగాథలు, వేదప్రవచనాలు నేటి యుగంలో గణనకెక్కి విశేషంగా కీర్తింపబడుతూ విదేశస్థులు కైవసం చేసుకొని తమ జ్ఞానాన్ని విస్తృతం చేసుకొంటూ నిరూపించుకొంటున్న దృశ్యాల్ని తిలకిస్తే బోధపడి తీరుతుంది.

అయినా ఒకరిని కీర్తిస్తూ మనల్ని మనం నిందించుకోవటమే భారతజాతికి స్వభావంగా సహజమైపోయింది. "పోయినదానికి వగచి ప్రయోజనం ఏం పొందగల్గుతాం - ప్రస్తుతకర్తవ్యాన్ని తలపెట్టాలి" అనేభావం మనలో మృగ్యమైంది. స్వతంత్రులం అయి చాలా కాలంఅయింది. ఆగష్టు 15 ను ఒక పర్వదినంగా ప్రకటించుకొని ఆనందంగా ఉంటున్నాం- కాని ముందు చేయాల్సినది ఏమిటో దానికి పునాదులేవిధంగా వేయాలో అని ఆలోచించే శక్తి సన్నగిల్లిన ప్రస్తుతప్రజానీకం, ప్రజాప్రభుత్వం ఒకసారి మేల్కొనాలి. ఇప్పుడు చేస్తున్నది ఇదివరకు మన పూర్వులు చేసినదానిలో సహస్రభాగమైనా అయి ఉంటుందా అని ప్రశ్నించుకొంటే జవాబుకై ఎదురు చూడటం ఎండమావులలో నీటిని పొందగోరిన మాదిరి పొడగట్టక మానదు.

ప్రాచీన మానవులు ఏర్పరచిన ప్రాతిపదికను విస్తృతం చేయజూడటం తక్షణకర్తవ్యం అని తలచినట్లయితే వెనుకటి ఉజ్వలయుగం భవిష్యత్తులో ప్రాప్తించి తీరుతుంది. వారేర్పరచిన ప్రాతిపదిక సారాంశం యీ దిగువనే పొందుపరుపబడినది.

1. పల్లెటూరు జీవాణువుగా దేశంలో పరిగణింపబడాలి.

2. ఆ జీవాణువును కాపాడుకోగల్గు శక్తి సామర్థ్యాలు కలిగియుండాలి.

3. అట్టి శక్తిసామర్థ్యాన్ని పొందేందుకు ప్రకృ పరిణామాల పర్యవేక్షణతో జీవిత ప్రయోజనకర వస్తుసముదాయం సేకరింపగలిగేందుకు ఉద్యుక్తులు కాగల సహజస్థితిని చేకూర్చుకొనాలి.

4. జీవితప్రయోజనాలు ఐహిక ఆముష్మిక రంగాలలో అత్యంత ఉపయుక్తమై యుండునట్లు చూడబడాలి.

5. ఐహికాముష్మికాల సంబంధం ప్రజానీకంలో ప్రత్యక్షంగా పరోక్షంగాపునీతుల్ని చేస్తుండగలిగేదిగా యుండాలి.

6. పైవిషయాల అంతరార్థ ప్రభావాన్ని సమకూర్చగలిగే విజ్ఞాన, పౌరాణికాది వస్తు విషయాదుల్ని భద్రపరచ గలిగే ఏర్పాట్లు ఎప్పటికప్పుడు జరుపబడాలి.

కనుక యీ పై ప్రాతిపదిక నాధారంగా తీసికొని పురోగమించే భావికి ప్రయోజనం వాటిల్లక మానదని విస్పష్టమౌతోంది. ఆనాటి పల్లెటూళ్ళు పై ప్రాతిపదికవల్లనే అపారఖ్యాతిని గణించాయి. నవనాగరికతను సృష్టించుకొన్నాయి. కళకళలాడుతూ ప్రకృతిశోభను ఆకళించుకొని శోభాయమానంగా విరాజిల్లినాయి. పూర్తిప్రపంచానికి పునాదిగా పేర్కొనబడినాయి.

అవే యీనాడు అధ్వాన్న స్థితిలో పడి ప్రాచీన భాగ్యలక్ష్మిని పోగొట్టుకొని పటుత్వహీనతవల్ల హేయాతిహేయంగా ఉన్నాయి. వాటిలో జీర్ణించి శిథిలమైన శక్తి సామర్థ్యాది సకల సామగ్రిని పునరుద్ధరించేందుకు ఉపక్రమించటం ప్రస్తుత మన కర్తవ్యంగా గుర్తిస్తే కనుచూపుమేరలో మనకీ దేవతను తిరిగి దర్శింప గలుగుతాం. అందుకవలంబించాల్సిన అధునాతన పంథా దిగువ పేర్కొనబడింది.

1. వెనుకటి ప్రాతిపదికను అవగాహన చేసికొ దానిని విస్తరింప పూనుటయే మొదటి పని.

2. ఆచరించే ప్రతివిషయం ఆలోచింపబడి, స్వార్థాన్ని చంపుకొంటూ త్యాగంద్వారా సంఘ శ్రేయస్సుకోసం తనకు తానే బలికాగల బలాన్ని పొందాలి.

3. స్వేచ్ఛ మానవునికి భౌతికంగానే ఉంటుం కాని మానసికంగా మృగ్యమని గుర్తించి స్వఇచ్ఛ మాని స్వేచ్ఛగా ప్రకృతి వశీకరణకై ప్రాకులా కలిగి నిత్యనైమిత్తిక రంగాల్లో అత్యంత శ్రద్ధ చూ గలిగే శక్తిని చిక్కబట్టాలి.

4. స్థలాలు మారుకాలం స్తంభించిందని గుర్తెరి సన్నిహిత సహకారాది సుస్వభావాలను కైవసంచే

గేయం:

# నేటి మనిషి

శ్రీ సి. నారాయణరెడ్డి

వర్తమాన వలయంలో
చిక్కుపడ్డ ఓ మనీషీ!
భవితవ్యపు సుడిగుండం
బారినుండి తప్పేనా?
కులమతాల తాసులోన
తెలివినితూచే కుమతీ
పితిలాంటి మేధస్సుల
నీ తరాజు తూచేనా?

మొరకురాళ్ళ దైవమంటు
మోసగించు పూజారీ
జనుల మోసగించలేవు
స్వాత్మనువంచించావోయ్
గతం పూడ్చివేసి భావి
గతులను నిర్మించలేవు
గతగర్భం త్రవ్వకుంటె
రతనాలు లభించలేవ?

కొంటూ స్వయంకృషి స్వీయప్రయోజనం పొందగలిగి ప్రజాప్రయోజన విషయాలన్ని విశదీకరింపగలిగే విస్ఫుటమహిమను వృద్ధిపరచుకోవాలి.

5. "ప్రజలు, ప్రభుత్వము, ప్రపంచము, సర్వాంతర్యామి' అని అగుపిస్తున్న ఈ నాల్గిటి సహజ స్వభావాల్ని గుర్తిస్తూ తమ తమ కర్తవ్యాదేశాల గుణపాఠాల్ని విశేషంగా విలీనంచేసికొంటూ సుస్థిరశాంతి నన్నివిధాలా పొందగలిగే మార్గాన్వేషణను పొందగలగాలి.

6. వ్యక్తి బాధ్యతలు వ్యక్తము కాగా, వ్యక్తుల శక్తియుక్తుల సహాయాది సమస్తసాధన సంపత్తితో సమంజసరీతిని ముందంజవేసే మహత్తర సంకల్పాది స్థిరచిత్తీకరణ ధృవవిశేషాలను ఉద్ధృతం చేసికోగలుగాలి.

ఇందలి భావపరంపరను పొందికగా అర్థంచేసికోగలిగితే విద్యావంతుడైన ప్రతివిజ్ఞాని తన బాధ్యతను గుర్తించగలడని తలపోయవచ్చును. కాబట్టి సమాన బుద్ధితో సద్యోగామియై సర్వజన ప్రయోజనకారిగా సాగిపోవాలని సాహసించే ప్రతివ్యక్తి వ్యాసవిషయాన్ని గ్రహించి, వ్యాసకర్తయొక్క మనోభావాల్ని పరోక్షంగానైనా గ్రహింపగలిగేందుకు ప్రాకులాడుతాడు. కాని యథార్థవస్తువుని ఉద్ధృతంచేయగలిగేందుకు తన వద్దగల ఉజ్వలశక్తిని ఉపయోగించటానికి జంకుతాడేమో! అట్టిదెన్నడూ జరుగరానిది. నేటి నవభారత స్వాతంత్ర్యశకపు నూత్నవత్సర సోపాన సముదాయాన్ని ఒకదానివెంట నొకటి ఆరోహింపగలుగుతున్న ప్రతి భారతీయుడూ గతించిన, జరుగుతున్న, జరుగబోయే విషయాల్ని గూర్చి యోచించకుండా ఉండడు. పల్లెటూళ్ల బాగోగులకై భావ్యమైన పంథాను తనకు తానే సృష్టించుకొని పల్లెటూళ్ళ నభివృద్ధికి తీసికొని వచ్చుటకు తలపోయుటయేకాక ప్రపంచకల్యాణానికి పునాదిరాయిని యీనాడు భారతదేశంలోని ప్రతి పౌరుడూ నాటివిశ్వమానవ సౌభ్రాతృత్వభావాలతో పూర్తిప్రపంచానికి ప్రయోజనకారిగా విలసిల్లగలిగేందుకు దీక్షను తీసికొంటాడని ఆశించవచ్చును.

★

# మన గ్రామాల స్థితిగతులు

శ్రీ బుద్ధవరపు సత్యనారాయణ

పురాతన కాలంనుంచీ కూడా భారతదేశ సౌభాగ్యానికి గ్రామాలే ఆధారాలు. భారతీయ సంస్కృతీ కేంద్రాలుగా గ్రామాలు విలసిల్లాయి. ఆనాటి పల్లెటూళ్ళ ప్రత్యేకత- స్వయంపోషకత్వం, స్వపరిపాలన. ఆర్థికంగా ఏ గ్రామంకూడ పరాయిదేశం మీద కాని, పరాయిరాష్ట్రం మీద కాని ఆధారపడి ఉండ లేదని చరిత్ర చాటుతోంది. గ్రామంలో నివసించే వివిధవర్గాల, తరగతుల మధ్య సుహృద్భావం, ప్రేమ, పరస్పరాదరణ ఉండేవి. ఆ రోజుల్లో గ్రామాలలో కులాల పలుకుబడి అత్యధికంగా ఉన్నప్పటికి ఏ వర్గానికీ అన్యాయం జరగలేదు. పల్లెటూళ్ళు నిత్య కళ్యాణం పచ్చతోరణంగా వర్ధిల్లేవి. సిరిసంపదలతో తుల తూగుతూ విశిష్టమైన పౌరసత్వాన్ని నెరపుతూ, మనచరిత్రలో ఒక స్వర్ణయుగాన్ని సృష్టించి, విదేశీయుల మెప్పులను కూడా పొంది దేశానికి శాశ్వతమైన కీర్తిని కలుగజేశాయి. ఆ రోజులు గడచాయి. దేశం పరాయిచక్రవర్తుల పాలనలో పడింది. మహమ్మదీయుల పాలనలో గ్రామాలకునికికి కొంతహాని వాటిల్లినా- భారతీయ గ్రామీణ వ్యవస్థ దెబ్బతినలేదు. కాని 'బ్రిటిష్‌వర్తకుల' పాలనలో మన గ్రామాలకు తీరని అపకారం జరిగింది. అనేక వందల సంవత్సరాలుగా, నిలుపుకుంటూ వచ్చిన గ్రామీణ వ్యవస్థ యొక్క సంస్కృతి కూకటి వ్రేళ్ళతో కూలిపోయింది. ఆంగ్లేయ రాజ్య ఫలితంగా మనగ్రామాలు స్వయం పోషకత్వాన్ని కోల్పోయి, పరాయి ప్రాంతాలమీద పరాయి దేశాలమీదా ఆధారపడటం మొదలు పెట్టాయి. తగాదాలను సుహృద్భావంతో పరిష్కరించుకుంటూ వచ్చిన గ్రామీణులు కోర్టుల కెగబ్రాకడం ప్రారంభించారు. తత్ఫలితంగా కొంపా గోడీ పోగొట్టుకొని గుల్లలయ్యారు. సౌహార్ద్రంతో చక్కటి పౌరసత్వాన్ని నెరపుకోగలిగిన గ్రామీణులు చిలిపి తగాదాలలో మాత్సర్యం, పట్టుదల ప్రదర్శిస్తూ పార్టీలు పెంచుకొని వీధి బడుతున్నారు. ధనంకోసం బ్రిటిష్ వాళ్ళు మన గ్రామాలను దోపిడి కేంద్రాలుగా, బానిసాగారాలుగా మార్చుకున్నారు. దీనిఫలితంగా మన పల్లెటూళ్ళు ప్రాచీన సంస్కృతిని కోల్పోయాయి అధునాతన నాగరికత నన్నా అలవర్చుకోలేక పోయాయి. రెంటికీ చెడ్డ రేవడిగా తయారయి ఏవిధంగా చూసినా హృదయ విదారకమైన స్థితిలో పడి ఉన్నాయి.

ప్రస్తుతం మన స్వతంత్ర భారతదేశంలో ఏ లక్షల ఇరవై వేల గ్రామాలున్నాయని అంచనా వేస్తున్నారు. మనదేశ జనాభాలో నూటికి 78 మంది పల్లెటూళ్లలోనే నివసిస్తున్నారు. దేశ జనసంఖ్యలో వాల్గింట మూడు వంతులు పల్లీయులే. భారతదేశపు కలిమి లేములీ గ్రామాల మీదనే ముఖ్యంగా ఆధారపడి ఉన్నాయి. మన ఆర్థిక సంపత్తిలో గ్రామాలస్థానం అత్యున్నతమైనది. గ్రామాల స్థితిగతులమీద దేశ భవితవ్యం ఆనుకొని ఉంది. మనిషి శరీరంలో హృదయాని కెటువంటి స్థానముందో భారతీయ వ్యవస్థలో గ్రామానికటువంటి ప్రాధాన్యము ఉంది. హృదయం పాడయితే శరీరం ఏవిధంగా అనారోగ్యం పాలవుతుందో అదేవిధంగా, గ్రామంస్థితి విపత్కరంగా వుంటే దేశం అధోగతిపాలవుతుంది. ప్రస్తుతం మన దేశం దరిద్రానికి ఆలవాలమవడానికి కారణం గ్రామాలను నిర్లక్ష్యంగా చూడడమే. ఒక ఆంగ్లేయ ఆర్థికశాస్త్రవేత్త చెప్పినట్లు 'దరిద్రం' ఇండియా గ్రామాల్లో నివసిస్తోంది. ఈ మాటలు అక్షరాల నిజం. ఒక్క గ్రామాన్ని కొలబద్దగా తీసుకుని పరిశీలిస్తే దేశపు నాడీక్షణంలో కనిపెట్టవచ్చు.

భారతదేశ సౌభాగ్యానికి పునాదులుగా ఎంచబడుతున్న గ్రామాలస్థితి ప్రస్తుతం ఏవిధంగాఉంది? గ్రామాలు అభ్యుదయం వైపుకు వెలుగులో పురోగమిస్తున్నాయా? దారిద్ర్యం వైపుకు చీకట్లో తిరోగమిస్తున్నాయా?

ముందు గ్రామాల్లోని విద్య తీసుకుందాం. సరాసరిని గ్రామంలో నూటికి పదిమందికంటె అక్షరాస్యులు

లేదు. ఈ పదిమందిలోనూ విద్యావంతులు మరీ తక్కువ. అంటే- నూటికి 90 మంది వయోజనులు నిరక్షరకుక్షులై నవప్రపంచ విద్యావిజ్ఞానాలకు దూరంగా ఉండి, (క్షమించాలి! నిజంచెప్పే నిష్ఠూరమేమో) కూపస్థమండూకాల్లాగ కాలం గడుపుతున్నారు. బాలబాలికల విద్య! ఇదొక విషాదకథ! చాలచోట్ల అసలు పాఠశాలలే ఉండవు. ఉన్న సక్రమంగా పనిచెయ్యడం లేదు. ఏకొన్నైనా సక్రమంగానే పని చేస్తున్నాయనిఅనుకుంటున్నప్పటికీ, వాటిలో చెప్పే విద్యకి గ్రామీణ జీవనానికి ఏవిధమైన సంబంధం లేకుండా పోతోంది! విద్యావిజ్ఞానాల్లో వెనుకబడిన దేశం ఏ అభ్యుదయమార్గంలోనూ త్వరితంగా పురోగమించలేదు. గ్రామాలు బాగుపడాలంటే ఇంటింటా విజ్ఞానజ్యోతులు వెలగాలి. ప్రతి గ్రామీణపౌరుడు విద్యావంతుడై తీరాలి. ఆనాటిదాకా గ్రామీణులకు 'సుఖజీవనం' అందని మ్రానిపండుగానే ఉండిపోతుంది.

ఆరోగ్యం విషయంలో కూడ పల్లెటూళ్ళు విషాదావస్థలో ఉన్నాయి. రకరకాలైన వ్యాధులకు పల్లెటూళ్ళు ఆటపట్టు. మొన్న మొన్నటి దాక పరిపాలించిన విదేశీ ప్రభుత్వం ఈ విషయంలో తీసుకున్న శ్రద్ధ చాలాతక్కువ. దానికి తోడు ఆరోగ్య శాస్త్ర విజ్ఞానం చాలామంది గ్రామీణులకి లేకుండాపోయింది. ఈ స్థితివల్ల గ్రామీణులు తగినంత బలంగా ఉండటంలేదు. పిల్లలస్థితి మరీ విచారకరంగా ఉంది.

వ్యవసాయం గ్రామీణుల ముఖ్యవృత్తి కదా దానిగతి ఎల్లా వుంది? ఎకరానికి మనం రాబట్టుతున్న ఫలసాయాన్ని అదే ఎకరంలో అభ్యుదయదేశాల రైతు సోదరులు రాబట్టుకుంటున్న ఫలసాయంతో పోలిస్తే నవ్వాలో ఏడవాలో తెలియని స్థితిలో పడతాం. అనేక రకాలైన కారణాలు ఈవ్యవసాయ దుస్థితికి తోడ్పడ్డాయి.

అనాదికాలంనుంచీ వస్తూన్న కుటీర పరిశ్రమలు క్షీణించాయి. రైతుల్లో ఎక్కువమంది ఉపవృత్తుల సంగతే మర్చిపోయారు. విరామ కాలాన్ని దుర్వినియోగం చేస్తున్నారు. ముఖ్యవృత్తైన వ్యవసాయానికి తోడ్పాటుగా ఉండే గృహపరిశ్రమలు క్షీణించడం వల్ల సామాన్య వ్యవసాయదారుని జీవితం ఆర్థికంగా అప్పులబాధకు లోనవుతోంది. పట్టణాల భారీ యంత్రపరిశ్రమల పోటీ కాగలేకుండా కొన్ని గృహపరిశ్రమలు క్షీణించాయనడంలో అతిశయోక్తేమీ లేదు.

పల్లెటూళ్ళలోని సాంఘిక జీవనంకేసి చూస్తే మరీ నిరాశ కలుగుతుంది. అవిద్యకి మూఢత్వానికి గ్రామాలు ఆటపట్టవడంతోటి గ్రామాల సాంఘిక జీవనం దుఃఖభాజనమైంది. అర్థంలేని చిన్న చిన్న తగాదాలు వృద్ధిచెంది విషమరూపం దాల్చుతున్నాయి. లిటిగేషన్ 'జబ్బు' ఎక్కువగా వ్యాపిస్తోంది. తాతలనాటినుంచి పేరుకుపోయిగడ్డకట్టుకుని ఉన్న సాంఘిక దురాచారాలు సంస్కరించబడకపోగా వికృతరూపం దాల్చి, మన గ్రామాలయందు ఒక విధమైన ఏహ్యభావాన్ని బైటివారికి కలగజేస్తున్నాయి. స్త్రీల సమస్య పరిష్కరించరానిదిగా తయారయి కొరకరాని కొయ్యగా మారింది!

చాలా గ్రామాలలో సమగ్రంగా పంచాయితీలు పనిచేయడం లేదు. ఉన్నవి వాటి విధ్యుక్త ధర్మాన్ని నిర్వర్తించగలిగే స్థితిలో కూడా లేవు. దిష్టిబొమ్మల్లాగ వింతగానూ, నామమాత్రావశిష్టంగానూ ఉన్నాయి.

ఈ దుస్థితినంతా గాంధీజీ ఏనాడో అవగాహన చేసుకున్నాడు. పల్లెజీవనాన్ని సంస్కరించుకొనడానికి మార్గాలని చూపెట్టాడు. "పల్లెలకు మరలండి. పల్లెటూళ్ళే దేశానికి పట్టుకొమ్మలు" అని ఎలుగెత్తి చాటాడు. గ్రామస్వరాజ్యం గురించి ఎన్నో కలలు కన్నాడు. ఎందరినో ఆవేశపూరితులనిచేసి గ్రామసేవకులుగా తయారుచేశాడు. ఆయన ఆశించిన గ్రామ స్వరాజ్యాన్ని ఆయనతోటే మర్చిపోయారు, ముఖ్యంగా ప్రభుత్వం నడుపుతూన్న నాయకులు. ఇందుకు ఉదాహరణ: పంచవర్షప్రణాళికలో కూడ దక్షిమిత్థంగా తగినంత ప్రాముఖ్యాన్ని గ్రామాభివృద్ధికివ్వకపోవడం.

అనధికారవర్గాలలో కొందరు ముఖ్యులు కుమారప్ప, వినోబాజీ, రామచంద్రన్, అగర్వాలావంటి వారు కృషిచేస్తున్నారు. గ్రామాభ్యుదయానికి వీరికి తగినతోడ్పాటును ఇప్పటికైనా ప్రభుత్వం ఇవ్వడం ఎంతేనా అవసరం.

పల్లెటూరికి సంబంధించిన ప్రతిసమస్యని నిర్మాణాత్మకదృష్టితో నిష్పాక్షికంగా పరిశీలించడం ప్రస్తుతం ముఖ్యావసరం. ముందు వ్రాయబోయేవ్యాసాల్లో ప్రతిగ్రామీణసమస్యని సమగ్రంగా చర్చిస్తాను. గ్రామసేవకులకి, రైతులకి, గ్రామాధికారులకి అమితోపయోగంగా ఉండగలవని ఆశిస్తున్నాను. పూర్వాపరాల్ని నిర్మాణయుతంగా విమర్శచేసుకొని, చక్కటి

(మిగతా ౧౫వ పేజీలో)

 

# నిర్వేదము



శ్రీ గొట్టిముక్కల కృష్ణమూర్తి

1. నందనోద్యాన దివ్యవనాన రామ
ధ్యాన నిశ్వాసమాధిలో డాగియుంగి
అరయ కున్నావు గాని నాయకుల వృత్తి
దివ్య చక్షుల నొకసారి తేరి జూచి
దిద్ది సుమ్మాదుకొనుము గాంధీమహాత్మ!

2. గడచెన్ నేటికి రెండు వత్సరములీ గద్వాలలోనన్ భవ
న్నుదుటన్ బుక్కిటు బట్టు నాయకులు లేనూటార్లు చందాల ని
య్యెడ నార్జించియు నీదు మూర్తి నిట సంస్థాపింతు మంచక్కటా!
కడ కీ నాటికి దిక్కుమాలితివిగా! గద్వాలలో గాంధిజీ!

3. అడిగే నాథుడె లేని కాల మవురా! ఆ గాంధిజీ పేర ని
య్యెడ చందాలను సేకరించియు ఘరానా నాయకుల్ వాని నె
క్కడనో? దేనికో? దొడ్డి వాకిళ్ళుల మార్గానన్ వృథా చేసిరే!
కడకీ నాటికి దిక్కు మాలితివిగా! గద్వాలలో గాంధిజీ!

4. కుడువన్ బెట్టను కల్గియున్న ఘనులై కూడా యిసీ! బాపుజీ
యెడ ద్రోహంబును లోకవంచనము సేయింపన్ దయార్హైరి ఓ
క్కెడ నీ సత్యము శాంత్యహింసలును గోరీలందుఁ డాగెలే!
కడ కీ నాటికి దిక్కు మాలితివిగా! గద్వాలలో గాంధిజీ!

5. మంత్రు లరసిరి- నాయకమ్మన్యు లరసి-
రరసి రెల్లరు నధికారు- లరసి రయ్యొ
కట్ట కడపటి కీర్తి గద్దువాల
దిక్కుమాలితి వేమి? గాంధీ మహాత్మ!



## అనువాద సాహిత్యం :

# మనిషికెంత భూమి కావాలి

శ్రీ పైడిమఱ్ఱి వేంకటసుబ్బారావు

"చెల్లీ! మీ పల్లెకు వచ్చినప్పటినుండి గుక్కురు మిక్కురుమన్నట్లుంది. తెల్లవారిందంటే ఎవరూ కనబడరు. పొలాలకు వెళ్లుతారు. పొద్దేపోవడంలేదు. ఏవస్తువూ దొరకదు. అంగళ్ళులేవు. నిన్న పండ్లతోముకునే నవనీతంకోసం విచారిస్తే దొరకలేదట. నిత్యం తినటం, పండుకోవటం తప్పితే క్లబ్బులులేవు, సినిమాలులేవు, మిఠాయిల అంగళ్లులేవు, మంచిగుడ్డల కొట్లులేవు. వచ్చిన పదిరోజులకే ఇట్లావుంది. ఎల్లప్పుడు మీరెట్లావుంటారే!?"

"మాకిట్లానే అలవాటయిపోయిందమ్మా. మాకు నిత్యము పచ్చని చేలకు పోకుండా ఉండాలిఅంటే తోచదు. మీరు బస్తీలలో డబ్బుపెట్టుకొని ఉన్నారంటే దాని సౌకర్యము మీకే తెలియాలి. పోయిన తడవ నేను మీయింటికి వచ్చినప్పుడు నాకు తోచనేలేదు. మంచి శుభ్రమైన గాలిలేదు. పాడుముండకి జలదారులు, దోమలు! ఇంతహాయిగా ఉండేదా?"

'పాడుపల్లెలలోపడి, ముదుకకూడు, ముదుకగుడ్డలతో పండినదంతా తొక్కాలు విరుచుకొంటున్నారు. ఏబస్తీలోనైన కాపురంపెట్టి ఒక అంగడివ్యాపారం మీ బావ గారిలాగ పెట్టుకుంటె మంచి సిల్కుచీరలు, సిల్కు జాకెట్టులు సన్నబియ్యముఅన్నము దొరుకుతవి. క్లబ్బులలోకి వెళ్ళొచ్చు! ఎప్పుడు ఎక్కడచూచిన పెండ్లి పండగగా వుంటుంది, బస్తీలో!"

"మీ విషయము మీకుబాగుంటే మావిషయము మాకుచాలు. మేముఒకనాడు లక్షాధికారులము కాము, ఒకనాడు దివాలాతీసి దీనతనము అనుభవించేది లేదు. మా భూమాతను ఆధారము చేసుకొని పండినపంటతోనే బట్ట; పొట్ట జరుపుకుంటాము మా పద్ధతులు మార్చుకోవాలిసినవి కావు. ఏగుడ్డో ఆగుడ్డ, ఏతిండో ఆతిండి. ఒకరిని మోసగించక చేతి కష్టముమీద పండించుకొన్న పంట చాలు. ఏమికావాలి? ఇదే పరమ భాగ్యము."

"ఏమి బ్రతుకు! గొడ్లమాదిరి మీకు సమాజము, మర్యాదలు ఏమి తెలియవు!"

"అయితే మానిరిలే." ఇంతలో ఇద్దరు భోజనం చేసారు. కంచాలు ఎత్తి, వంటయిల్లు శుభ్రము చేసి అక్కకు వక్కలాకులు తెచ్చి యిచ్చింది చెల్లెలు. విశ్రమించడానికి ఇద్దరు గదిలోనికి వెళ్ళారు. వీళ్ళ సంభాషణ చెవిపెట్టి వింటున్నాడు రైతు రామసహాయ్. తన కష్టజీవితము నిజముగా శోచనీయముగానే తోచినది. ఉన్న ఇరువై ఎకరాలలో పండినపంట తనకు తన కుటుంబానికి తిండి; గుడ్డకు కటాకటీగ సరిపోతూ వున్నది. అంగడి వ్యాపారము చేయటానికి దాని యందు అభిరుచిలేదు. అనుకున్నాడు- "నాకుతృప్తి కరముగా చాలినంత భూమి చేతిలో వుంటే పిశాచాన్నైనా ఎదుర్కొనే వాడినిగదా" అని.

లోపలవున్న ఆశాపిశాచము మనోహరమైన ఆకృతితో సంకల్పసిద్ధిస్వరూపముతో మాయాతంత్రాల పన్నికలతో రామసహాయ్ ఎదుట ఊహా పరంపరలుగా ప్రత్యక్షమయింది.

తనదగ్గరవున్న వందరూపాయలు పెట్టి తనపొలము ప్రక్కనవున్న మాలవాడి 15 ఎకరాల పొలము ధరలు క్రిందుమీదు చేసి సంపాదించాలి. ఆరోగ్యము వుండి ఏమి చేస్తున్నది వృధాగా? ఇప్పటి ఇరవై ఎకరాలతోపాటు ఈ పదిహేను ఎకరాలే ఉంటేనో కోరిన పంటలు పండించి దరిద్రహతము చేసికోవచ్చు. క్రమేణ ఒక భూస్వామికూడ కావచ్చునని అనుకొన్నాడు.

మరునాడే ఎత్తుకు పై ఎత్తువేసి ఇతరులకు భూమి పోనీయకుండా తనచేతిలోకి రాబట్టుకొన్నాడు. దానితో కొంచెము మనస్సులో తృప్తి పొడసూపింది. అది ఎంతకాలమోలేదు. ఒక సంవత్సర మయ్యేసరికి ఆ భూమి అంతా మెట్టభూమి, మాగాణి ఆ ప్రాంతములో లేకున్నందున ఒక కొన్ని ఎకరాలైన ఎక్కడైనా దొరికితే తీసికోవాలి అనే ఆశ కలిగి లోపల వేధించ సాగింది. మాగాణి పొలమంటే మాటలుకాదు. ఎంతో డబ్బుకావాలి. ఉన్నడబ్బంతా ప్రస్తుతము భూమికే సరిపోయింది. ఆ సంవత్సరంపంట అంత బాగా పండలేదు- అకాల వర్షాల వల.

ఒకనాడు రామసహాయ్ పంచలో చుట్ట కాల్చుకుంటూ కూర్చున్నాడు. అప్పుడు 11 గంటలౌతుంది. ఎండతీవ్రంగా ఉన్నది. గుఱ్ఱముమీద ఒక పెద్ద మనిషి అతనియింటి ముందటికి వచ్చి గుఱ్ఱము నిలవబెట్టి 'అయ్యా! మీ యింటిలో కొంచెము విశ్రమించనిస్తారా?'! అనిఅడిగాడు రామ్‌సహాయ్‌ని.

"మంచిది గాండి! ఏ గ్రామమునుంచి వస్తున్నారు! ఎవరు మీరు" అంటూ వివరాలు గూర్చి ప్రశ్నించాడు.

"నేను చాలా దూరమునుండి వస్తున్నా! రెండు రోజులయినవి ప్రయాణముచేస్తూ! మేము చాదరులము; రొట్టెలున్నాయి తినటానికి" అంటూ లోనికి వెళ్ళి గుఱ్ఱమును కట్టివేసి బావిదగ్గర ముఖము కడిగి కొన్ని రొట్టెలు తిన్నాడు. రామ్‌సహాయ్ తెచ్చిన నీరు త్రాగాడు.

ఎండ తీవ్రత తగ్గలేదు. ఆ పెద్దమనిషి విశ్రమించి ప్రక్కనవున్న రామ్‌సహాయ్‌తో ప్రసంగవశాత్తు అడిగాడు. "మీకెన్ని ఎకరాలభూమి వున్నది? మంచిదేనా?" అని.

"ఉన్నది, ముప్పయిఐదు ఎకరాలు. ఏమంత మంచి భూమి కాదు. అంతా మెట్టభూమి" అన్నాడు రామ్ సహాయ్ నీరసంగా.

"మా ప్రాంతములో ఇంకా చాల భూమి బీడుపడి ఉన్నది. అడిగేదిక్కులేదు. మాగాణి వున్నది మెట ఉన్నది".

"మేమువస్తే ఇస్తారా! ఎంతభూమి దొరుకుతుంది? ఏలెక్కప్రకారము?"

"ఏమిలెక్కలేదు. మీరురండి. అది నవాబుల జాగీరుతాలూకు భూమి. మీరువస్తే చాలంగాని భూమి తప్పక దొరుకుతుంది. నేను ఇట్లానే వెళ్లి భూమి తీసికొన్నాను. నాకు ఎకరా పావలాచొప్పున దొరికింది. కాని వాళ్లదగ్గరికి స్నేహితుడిలాగ వెళ్ళాలి. వాళ్లతో స్నేహము కావాలి- అంటే బాగా తేయాకుడబ్బా ఒకటి, పట్టుచొక్కాలు, పరచుకొనే నాలుగు కంబళ్లు మంచి లంకాపొగాకు తీసికొని పోవాలి. నేనిట్లానే తీసికొని వెళ్లాను. నాయిష్టమువచ్చినభూమి ఇచ్చారు. మంచివాళ్ళు! మీరువస్తే కోరినభూమి తప్పక చిక్కుతుంది".

రామ్‌సహాయ్‌తో ఈ మాటలు చెప్పి ప్రొద్దు కొంచెమున్నందున, దూరము వెళ్ళవలసినవాడు కాబట్టి గుఱ్ఱముమీద బయలుదేరాడు. ఆ పెద్దమనిషి గుఱ్ఱము మాదిరిగా రామ్‌సహాయ్ మనస్సు అనేకమైన ఊహాలు తలపోస్తు పరుగెత్తసాగింది. ఆ భూమి తనకండ్లకు కట్టినట్లు కానవస్తూవున్నది. ఇక్కడ భూమి చాల ధరలు వున్నాయి. కొన్నప్పటికంటె ఇప్పుడు భూమిధరలు హెచ్చినవి. అమ్మితే చాల డబ్బువస్తుంది. ఇక్కడ భూమి ముప్పైఐదు (35) ఎకరాలు అమ్మితే సుమారు వెయ్యిరూపాయలు వస్తాయి. వాటితో కోరినభూమిని తీసికోగలుగుతానని ఆ భూమి విక్రయించడానికి నిశ్చయించుకున్నాడు. ఇంతకుముందెన్నోసార్లు, 'భూమి యిస్తావా? ప్రాంతముగాని, కడకు పదిఎకరాలైన యిస్తావా?' అని అడుగుతూవచ్చిన అక్కడి కమ్మ అతనికి తన గాపగానితో చెప్పిపంపాడు. స్వాతివాన చినుకుకోసం నోరుతెరచికొని ఉన్న ముత్యపుచిప్పలాగా వేచిఉన్న కమ్మ అతను సంతోషించాడు. రామసహాయ్ చేతిలో ఝుణఝుణమంటూ వెయ్యిరూపాయలు అనుకున్నట్టు కుమ్మరించాడు.

రామ్‌సహాయ్ తన భార్యకు త్వరగావస్తానని పిల్లలను జాగ్రత్తగా చూడమని చెప్పాడు. బఱ్ఱెగొడ్లను ఆవులను కాపాడుతూ ఉండుమని, యింటిదగ్గర ఎప్పుడు తను వచ్చేదాక కాచుకుంటూ వుండమని గాసగాడికి చెప్పి తనవెంట ఒకరిద్దరు ముఖ్యమైన పనిమనుష్యులను తీసుకొని బండిమీద సాగాడు.

అడవులలో నాగులవద్దున చెట్టుక్రింద విశ్రమిస్తు తెచ్చుకున్న రొట్టెలు; చద్ది తింటూ నాలుగవనాడు రెండుఝాములగుసరికి ఆ నవాబుల డేరాల చేరబోయినారు. వెంట ఆ పెద్దమనిషి చెప్పిన ప్రకారము తేయాకుడబ్బా: పట్టుచొక్కాలు: కంబళ్ళు: పొగాకు వున్నవి.

వారి బండిచప్పుడును వింటూనే ఆడేరాలో నుండి జనము వచ్చారు చూడటానికి. చాలా మర్యాదతో తోడ్కొనివెళ్లారు డేరాలోనికి. మంచి సోఫాలమీద కూర్చోపెట్టారు. కమ్మని తేనీరు యిచ్చారు. రామసహాయ్ పుచ్చుకున్నాడు. హుక్కా ముందుపెట్టారు. రామ్‌సహాయ్ రెండు పీల్పులు పీల్చాడు గూడా. కొంచెము తిరువాత రొట్టె, మాంసము ముందుపెట్టారు. భోజనమైనది. నవాబు 'బక్షి' పరివారముతో చేస్తున్న ఈ మర్యాదలకు చాలా సంతోషించాడు రామ్‌సహాయ్. తనదగ్గరవున్న తేయాకుడబ్బా, పట్టుచొక్కాలు, కంబళ్ళుముందు పెట్టాడు అవిచూచి 'బక్షీ' అతిసంతోషముతో పొంగిపోయాడు.

'ఏమికావాలి అని వచ్చావు?' అన్నాడు బక్షీ తన భాషలో. వెంటనే ప్రక్కనవున్న దుబాసీ రామ్‌సహాయ్‌తో దానిభావము చెప్పాడు.

"అయ్యా! నేను బీదవాడిని. భూమిలేదు. మీరు నాకు భూమి దయచేయవలెను" అన్నాడు రామ్‌సహాయ్.

"ఫరవాలేదు. కోరినభూమి తీసుకోవచ్చు."

'మీరు చూపనిది ఎట్లా తీసుకోగలను? వీా తరువాత మీ పిల్లలు నాకిచ్చిన భూమిమీద ఆక్షేపణలు చేయకుండా ఏదైన రొక్కము తీసికోవాలి!!,

'చాలమంచిది.'

'బందోబస్తుగా కాగితాలు వ్రాసియివ్వండి.'

'చాలామంచిది.'

'అయితే ఏప్రతిఫలము దబ్బుయివ్వాలి?'

'ఒకరోజుకు వెయ్యిరూపాయలు.'

'ఇదేమిలెక్క?'

'సూర్యోదయమప్పుడు బయలుదేరి సాయంత్రము వరకు ఎంతభూమిమీద నడువగలిగితే అంతభూమి. ఇదే మాకొలత.'

"ఎప్పుడు వెళ్ళుదామంటారు?"

"రేపుదయము."

సాయంత్రమయింది. రాత్రిమించగా మాంసము, రొట్టె, మీగడ, తేనీరు యిచ్చారు. పుచ్చుకున్నాడు. హుక్కా పీల్చారు. రామ్‌సహాయ్ పక్కమీద మేను వాల్చాడు. కాని కన్ను మలిగితే ఒట్టు. ఒక్కరోజులో ముప్పైమైళ్లవరకు కూడ నడువవచ్చు. ఓహో! ఎంత భూమి! అనుకుంటూవున్నాడు. పొర్లుతూవున్నాడు. ఎంతోరాత్రికి కునుకుపట్టింది. నానాకారాల పిశాచపు వికృతాకారాలు ఏవేవో కనుపించాయి, అర్థంచేసుకోరానివి.

ఇంకా సూర్యోదయము కాలేదు. కలతనిద్రనుండి కన్నులు తెరిచాడు. అరుణకాంతులు ఆ డేరాలమీద పడుతున్నాయి. వెళ్ళవలసి వున్నదికదా అని చప్పున లేచి కూర్చున్నాడు. ముఖము కడుగుకొని 'బక్షి' నవాబును లేపబోయినాడు. మీగడ, మాంసము, రొట్టె తేనీరు పుచ్చుకొన్నాడు. రామ్‌సహాయ్ వారితోపాటు గుఱ్ఱాలమీద పరివారము బయలుదేరింది. 'బక్షి' నవాబుతో రామసహాయ్, అతని బంట్రోతులు ఒక గడ్డపార మేకులు, వగైరా 'బక్షి'నవాబు చెప్పినట్లు బండిమీద పెట్టుకొని దారిపట్టారు. వెళ్ళి వెళ్ళి ఒకకొండ అడుగుభాగములో ప్రవేశించారు. అంతాదిగారు.

బక్షి చేయెత్తిచూపుతూ- "ఇదంతా మనభూమి. ఏదిశకుపోదలుచుకుంటే ఆదిశకు పోవచ్చును. సాయంత్రము అయ్యేసరికి ఇక్కడకు చేరరావాలి. లేకుంటే నీకు దబ్బు దొరకదు. భూమి మిగులదు. వెయ్యిరూపాయలు ఈ టోపీలోపొయ్యి! అంటూ తన టోపీని క్రిందపెట్టాడు.

రామ్‌సహాయ్ తన దగ్గరవున్న రూపాయలు టోపీలోపోసి మంచినీళ్ళతిత్తి, రొట్టెలు భుజానికి తగిలించుకున్నాడు.

'ఇదిగో ఎక్కడెక్కడ మళ్ళుతావో, అక్కడక్కడ, గోతిత్రవ్వి మేకులు నాటెయ్యి. తరువాత ఆ మేకుల చాలున నాగేలు పోనిచ్చి భూమికి హద్దులు ఏర్పాటు చేస్తాము. ఈ మేకులుకూడా వుండనియ్యి' అన్నాడు.

సూర్యుడు తలనిక్కించాడు లోకాలను చూడడానికి. బక్షి రామ్‌సహాయ్‌ను బయలుదేరమని సంజ్ఞ చేసాడు. రామ్ బిరబిర నడుస్తున్నాడు. నాలుగు మైళ్లునడచి వెనుకకు చూచాడు. ఇంకా కొండఅడుగు భాగము కానవస్తున్నది. మనుష్యులు, అక్కడవున్న టోపి వగైరా స్పష్టముగ గోచరిస్తూ ఉన్నాయి. "ఇప్పుడే తిరిగిపోవడమేమిటి? ఆహా! ఎంతమంచి మైదానము? భూమి,సమపల్లము."

అనుకుంటూ మళ్ళీ ముందు రెండుమైళ్ళు వెళ్లాడు. తనకు కుడిప్రక్కన భూమీమీద గడ్డి ఎదలబంటి పెరిగియున్నది. భూమి కాళ్లకు మెత్తగా తడితడిగా తగులుతు వున్నది.

"ఈ భూమి చాలామంచిది. ఇది ఒక నాలుగెకరాలయినా ఉంటేబాగని మరి నాలుగుమైళ్ళు నడిచాడు."

ఎండ తలమీదకి వచ్చింది. గొంతు ఎండుతూ వున్నది. ఆకలికూడ వున్నది. కూర్చుంటే మళ్ళీ లేవ చేతగాదని నిలుచుండే రొట్టెతిని మంచినీళ్ళు త్రాగాడు. ఎంత మంటలు కురిపిస్తు వున్నది. నడచినకొద్దీ భూమి కండగలదిగా కనుపిస్తూ వున్నది. ఇది పది ఎకరాలు ఆది నాలుగెకరాలు అంటూ నడుస్తున్నాడు, తాను బయలుదేరిన తావుకు వెళ్ళాలి అనేది మరచి. మరలిన చోటల్లా మేకులు నాటుతూ అట్లే నడచినడచి పొద్దువంక చూచాడు. తాను బయలుదేరిన కొండను వీక్షించాడు. ప్రొద్దువంగింది. కొండ ఎంతో దూరమున వున్నది. పొద్దుండగనే గమ్యస్థానము చేరాలి అనే తొందరలో నడక వేగము చేశాడు. ఒకటేతీరున ఆగకుండ నడుస్తున్నందువల్ల చెమటలు కారుతూ వున్నయి. గుడ్డలు తడిసి పోయినాయి.

ఏలాగైనా బయలుదేరిన చోటు చేరాలి. లేకుంటె ఇంత శ్రమపడ్డందుకు ఏమిఫలం దక్కదని, ఆకొండ చాయనే నడుస్తున్నాడు. నడచి చూచినభూమి చాలునని తృప్తిపడడం కంటే ఆందోళన ఎక్కువయింది.

గీతిక:

# కర్తవ్యము

శ్రీ పెండ్యాల హనుమచ్ఛర్మ

సంఘ కలహము లన్నింటి సాగనంపి
జనుల యందైకమత్యము సంఘటించి। అక్ష
రజ్ఞాన హీనులై యలరువారి - యక్షరజ్ఞా
నవంతులై యలరునట్లు దీక్షబూనుమి సో
దరా - దీక్షబూను...... ౧

ముద్రితాముద్రిత గ్రంథములను గాంచి- పూర్వ
విజ్ఞాన ధనమును బుడమినిల్ప। యత్నమొ
నరించుటయె నీదు లక్ష్యమంచు। దీక్షబూను
మి సోదరా దీక్షబూను...... ౨

తెలుగు భాషాభిమానము తొలగినట్టి - సో
దరాంధ్రుల కింపుగా సుకవియువక। తెలు
గు భాషాభిమానము కలుగునట్లు। దీక్ష
బూనుమి సోదరా దీక్షబూను...... ౩

తెలుగువీరుల కీర్తులు - తేజరిల్ల। తెలుగు
వారల యశములు - దిశలునిండ - తెలుగువా
రల శిల్పము - వెలుగునట్లు - దీక్షబూనుమి
సోదరా దీక్షబూను...... ౪

---

అటు ప్రొద్దు: ఇటు ఆ కొండతిప్పను చూస్తూనే ముందుకు సాగుతున్నాడు. అలసట ఎక్కువైంది. శ్వాస కొలిమి తిత్తిలాగ ఆడుతున్నది. నిజంగా గుండె సమ్మెటలాగ కొడుతూవున్నది. కాళ్ళు చేతిలో లేవు. పట్టగుడ్డలలాగ ఈడ్చుకు పోతూవున్నాయి. అయినా ఒక నాటికష్టము ఎల్లకాలము సుఖములనుకుంటూ పోతు వున్నాడు. కొండసమీపములోనికి వచ్చాడు. ఇంకా మైలు దూరమున్నది నడవటానికి. బక్షి చేతులు కట్టుకొని టోపీదగ్గర నిలుచున్నాడు. అప్పుడప్పుడు చేతితో రమ్మని సంజ్ఞ చేస్తున్నాడు. ప్రొద్దు కనబడకుండా పోయింది. రామ్ నిరాశపడుతున్నాడు. ఇంతఆయాసపడినా డబ్బు, భూమి రెండు పోతాయేమోనని దిగులుపడుతున్నాడు.

“ఫరవాలేదు, కొండచాటున ప్రొద్దుకావస్తూ వున్నది. నడువు, త్వరగా రా” అని అరచాడు బక్షి, చేయి యెత్తి సంజ్ఞచేసెను.

రామ్ నేలకువంగి అతికష్టముతో దేహాన్ని యీడ్చి యీడ్చి వచ్చాడు టోపీదగ్గరకి.

“చాలామంచి భూమిదొరకింది. సెభాస్-” బక్షి అన్నాడో లేదో ధబ్బుని నేలకూలాడు రామ్! లేవనెత్తడానికి బంట్రోతులు వచ్చారు. నోటిలోనుండి రక్తము కారుతూవున్నది.

నిశ్చేష్టగా పడివున్న రామ్‌సహాయ్ దేహాన్ని తాకి చూశాడు- ‘పాపం ఇక లాభంలేదు. చనిపోయాడు,’ అని నాలుక కొరుక్కున్నాడు బక్షి.

రామ్ బంట్రోతులు అక్కడే గొయ్యి త్రవ్వి రామ్ శరీరాన్ని పెట్టి పూడ్చారు. ఇంతే, రామ్‌కు తలనుండి కాళ్ళవరకు కావలసింది ఆరడుగుల భూమి. పాపం ఇంతకోసం ఎంతో శ్రమపడ్డాడు. ఇప్పుడు తన యిల్లు, భార్య, పిల్లలు, తుదకు ప్రపంచము ఏమయిందో తెలియని తావుకు చేరుకున్నాడు. బ్రతికి ఉన్నప్పుడే దీన్ని గ్రహించివుంటే బాగా ఉండేదేమో.

[టాల్‌స్టాయ్ రచించిన- “How much land does a man require” కి, అనుసరణ-]

---

(౧౦వ పేజీ తరువాయి)

బాటల్ని నిర్మించుకుని గ్రామాభ్యుదయ సాధనకై బాపూ కలలుకన్న గ్రామస్వరాజ్యానికై అభ్యుదయ పథంలో పురోగమిద్దాం.

మనవి: నా వ్యాసాల్లో సందర్భవశాత్తు తప్పనిసరిగా చేసిన విమర్శ గ్రామాభ్యుదయాన్ని ఆకాంక్షిస్తూ, గ్రామాభివృద్ధికొరకు మాత్రమే ఉన్నదన్నట్లు వ్రాసినట్లు భావించుకొమ్మని, ఆవేశంలో వాడిన శబ్దజాలాన్ని అపార్థం చేసుకోవద్దని నా సవినయపూర్వకమైన మనవి- రచయిత. ★

## వ్యావసాయిక విజ్ఞానం:

# ఎరువులు

### శ్రీ గుండెపూడి సీతారామ్

విజ్ఞానశాస్త్రము మానవునికి చేసిన సేవ అపారము. మానవ శ్రేయస్సు కొరకు విజ్ఞానశాస్త్రము అనేక మార్పు లొందింది. కానీ శాస్త్రవేత్తల చేతుల్లో విజ్ఞానశాస్త్రము మానవుని హతమార్చుటకు మృత్యువులా తయారయిందేమోనిపిస్తుంది. ఖడ్గమున్నదీ అంటే దాని మంచిగాని చెడుగాని వుపయోగించే వానిమీద ఆధారపడియున్నది, కానీ ఆ వస్తువుమీద యేవిధముగ ఆధారపడిలేదు. అదేవిధముగ విజ్ఞానశాస్త్రము కూడా వుపయోగించు పద్ధతి ననుసరించి మాత్రమే ఫలితముల నివ్వగలదు. మానవుడు బ్రతికి బట్టకట్టాలంటే పోషక పదార్థములనిచ్చు పుష్టికరమగు ఆహారమును తీసుకొనవలెను. అందువలన మానవుని జీవితము ముఖ్యముగా కాయలు, కూరలు, పప్పులు, ఫలములు యిచ్చు చెట్లమీదను లేక చెట్లనుండి వచ్చు పదార్థములు తిని బలసిన జంతువుల మాంసము మీదనూ ఆధారపడి యున్నది. కావున మానవుడు జీవించుటకు చెట్ల పెంపకము యెంతేని అవుసరము.

మానవుడు బ్రతుకుటకు పోషక పదార్థములు గల ఆహారమేవిధముగ అవుసరమో అదేవిధముగ వృక్షములు పెరుగుటకు సూర్యరశ్మి నీరు, కర్బనద్విఆమ్లజనిదములతో బాటు నత్రజని, భాస్వరం, పొటాషియం సంబంధమయిన లవణములు కూడా అవుసరము. చాలవరకు వృక్షములకు సూర్యరశ్మి గాని సారవంతమయిన భూమి, కర్బనద్విఆమ్లజనిదము వాతావరణమునందే— అందుబాటులో నున్నవి. అందువలన అవుసరమయిన ఖనిజలవణములను మాత్రమందజేసిన వృక్షముల పెరుగుదల కాటంకముండదు. ఆకారణముచేతనే మన పల్లెటూరి ఆసామి (శ్రమకోర్చి) ప్రతి సంవత్సరము తను నిల్వచేసియుంచిన జంతువుల మలమూత్ర విసర్జనముల తోను బూడిదతోను ఆకుల తోను మాగియున్న మట్టిని పొలములకు తోలుతుంటాడు. ఎందుకలా పొలమునకు ఎరువు తోలాలి అని అతన్ని ప్రశ్నిస్తే, పొలము బలిష్ఠమయి సారవంతమగుటచే మంచి పంటల నిస్తుందంటాడు. కానీ శాస్త్రరీత్యా కారణమేమంటే- పొలమునుండి పంటలను యెడతెగక పండిస్తుండే భూమిలోనుండి చెట్లకు కావలసిన లవణములన్నియు పిండివేయ బడుతవి. ఈ విధముగ కొన్నేండ్లు పంటపండించిన పిదప ఆ భూమి నిస్సారమయి మరి పండించుటకు తోడ్పడకుండును. ఇలాటి భూమిని దస్సిన భూమి అందురు.

దస్సినభూమిని సారవంత పరచుటకు మన వ్యవసాయదారులు ఆ పొలములకు ఎరువుల నిచ్చియో నాగలితో దున్నియో కొత్తలవణముల నందించ గల్గుతున్నారు. అందుచే చెట్ల పెరుగుదలకు ఎరువు లెంతేని అవుసరము. ఇక విజ్ఞానశాస్త్ర విశాల వృక్షోప శాఖ అయిన ఎరువుల చరిత్రను గురించి తెలుసుకొందము.

ఎరువులంటే ఏమిటి? నిస్సారమయిన భూమికి నూతన లవణముల నందజేసి సారవంత పరచుటకు తోడ్పడు స్వభావ సిద్ధమయిన పదార్థములను గాని కృత్రిమ పదార్థములను గాని ఎరువులందురు. ఈ రెండు రకముల పదార్థములందునూ వృక్షముల పెరుగుదలకు తోడ్పడు లవణములు చాల విరివిగ నుండును. ఎరువులు రెండు రకములు. 1. స్వభావ సిద్ధమయినవి 2. కృత్రిమమయినవి. కృత్రిమ యెరువులనే సాగకములని కూడా అందురు. స్వభావసిద్ధమగు ఎరువులు- 1. దొడ్డపెంట— మన యిండ్లలో సంవత్సరాంతం వరకు ఆవులు గేదెలు మొదలయిన జంతువుల మలమూత్ర విసర్జనములు, అవితొక్కిన గంటు, ఆకులు, కర్రకాల్చిన బూడిద మొదలయిన వాటిని ఒకచోట నిల్వజేసి తదుపరి పొలములకు బండ్ల సహాయమున తోలుతుండడం చూస్తున్నాము. ఇది అతిస్వభావ సిద్ధమయిన ఎరువు భూమికీ యీఎరువు నందజేసిన చెట్లకు కావలసిన లవణములన్నియూ తగు పాళ్ళలో దొరికును, కాన చెట్లు అతి సులభముగ పెరిగి విలువైన పంటల నిచ్చును. .. పచ్చి ఎరువు- ఆసాములు నీలి చెట్లను గాని వెంపలి చెట్లను గాని దుండిగపు చెట్లను గాని చేలలోవేసి అతిబాగుగా పెరిగిన తరువాత పొలమునంతనూ చదును చేసి చెట్లను భూమిలో కలియు

నట్లు దున్నుదురు. ఇట్లు చేయుటవలన యీ చెట్ల వేళ్ల మీదనున్న బుడిపెలలోని సూక్ష్మజీవులు నేరుగా గాలిలోని నత్రజనినుండి నత్రితములను తయారుచేసి నిల్వయుంచునుగాన భూమికి పచ్చిఎరువు ద్వారా విరివిగా నత్రితము లందుబాటులోనుండును.

పై ఎరువులు పొలముల కెంతో ముఖ్యమయినప్పటికినీ వీనిని తయారు చేయుటకు తగిన వ్యవధి కావలయును గాన ఈ ఎరువులను విరివిగా, భూములకు చాలినంత తయారు చేయలేక పోవుచున్నారు. అందుకని కృత్రిమ పద్ధతులతో భూములకు సరిపోవునంత ఎరువులు తయారు చేయుట అవసరమయినది. కృత్రిమ ఎరువులను మూడు తరగతులుగ విభజింప వచ్చును. 1. నత్రజని ఎరువులు — ఈ ఎరువులలో నత్రజని యుండును. గాలిలోని నత్రజనిని ఉదజనితో సంయోగమొందించి, అమ్మోనియా వాయువును తయారు చేసెదరు. అమ్మోనియానుండి మిక్కిలి శ్రేష్ఠమయిన అమ్మోనియాగంధకితము (Ammonium Sulphate) అను ఎరువు తయారు కాబడుచున్నది. ఈ యెరువునే హిందూదేశము ప్రతియేటా ఒకలక్ష టన్నులవరకూ వుపయోగించుచున్నది. ఇందులో దరిదాపు ముప్పదివేల టన్నులవరకు మనదేశములోనే తయారు కాబడుచున్నది. 2. భాస్వర ఎరువులు — భాస్వరము భూమిలో స్వభావసిద్ధముగ కాల్సియం భాస్వరితముగ దొరుకుచున్నది. మానవుల జంతువుల ఎముకలందు దరిదాపు నూటికి ఇరువదిపాళ్ళు యీ పదార్థమున్నది. అందుచేత ఎముకల పొడినే భూమికి ఎరువుగా అందించుచున్నారు కాని ఎముకల పొడి భూమిలోని నీటిలో కరగదు కాన దీనినుండి నీటిలో సులభముగ కరిగి చెట్లవేళ్ళచే గ్రహించుటకు వీలయిన సూపరును తయారు చేసెదరు. సూపరు తో… లకు ముఖ్యముగ ఎరువుగా తోడ్పడుచున్నది.

3. సోడియం పొటాషియం లవణములు — సోడియం నత్రితము అమెరికాలోని చిల్లీరాష్ట్రమున విస్తారము భూమిలో లభ్యమగుచున్నది. అందువల్ల దీనిని చిల్లీ పెట్లుప్పు అందురు. పొటాసియం నత్రితము బంగాళములో విరివిగా దొరుకుటచేత దీనిని బెంగాల్ పెట్లుప్పు అని పిలచెదరు. మరియు కర్రకాలిన బొగ్గును కాల్చగా మిగిలిన బూడిదయందుకూడ వృక్షములు పెరుగుటకు తోడ్పడు సోడియంపొటాసియం భస్మములుండునని, యీ వృక్షభస్మములు లేనిదే చెట్లజీవితము దుర్లభమని శాస్త్రపరిశోధనలు ఘోషిస్తున్నవి. అందువలన యీ లవణములను ముఖ్యమయిన ఎరువులుగా వుపయోగించుచున్నారు.

నాగరికతలో ముందంజవేసిన దేశములన్నియు వ్యవసాయము చేయుటకు సులభపద్ధతులను కనుగొన్నారు. విద్యుద్దీపపు కాంతుల్లో విస్తరించి విశాల విశ్వాన్ని విచిత్రమయిన మరనాగళ్ళతో సునాయాసముగ దున్ని, కృత్రిమ ఎరువులను వెదజల్లి మంచి పంటలను అనుభవిస్తున్నారు. నూతన పద్ధతుల్లో మరనాగళ్ళచే పొలములను పదునుచేసి, కృత్రిమ ఎరువులను చల్లి భూములను సారవంతపరచిన మన భూములు సస్యశ్యామల శోభితములయి, అనేకరెట్లు వృద్ధి పంటలనీయగలవు. ఆ విధముగ విజ్ఞాన శాస్త్రమును వ్యవసాయదారుని చేతులో కీలుబొమ్మగా మార్చి హిందూదేశీయులు తాము అభ్యసించిన విద్య, శాస్త్ర రీత్యా వ్యవసాయము చేయుట కుపకరించునట్లు చేసిన, హిందూదేశములో కరవనునది కాలు పెట్టుట తావుండదు.



# అభినందన పత్రము

## [కొల్లాపురమున పరిషత్తు విజయపత్ర ప్రదాన సభల సందర్భమున ఇచ్చిన అభినందన పత్రము]

---

1. ఉ॥ ఆగకయాడునట్టి గడియారము రీతిగ కృష్ణశర్మ చే
యాగని రీతి భాష వెలయన్ దగు రీతి "సుజాత" పత్రికా
భోగము నేటియాంధ్రులకు మోదముగా సమకూర్చినిచ్చె నీ
యోగికి సాటి యొండు కలదే పలుమాటలు పల్కనేటికిన్.

2. ఉ॥ చూడఁగలేదు కృష్ణకవి సోమునిఁ గన్నుల కట్టెదుటం గాఁ
జూడఁగలట్టి భాగ్యము సొక్కితి; మిక్కిలి సొక్కుచుంటి; నేఁ
జూడకపోయినన్ గలముసోయగమున్ దని దీరఁ జూచితిన్
వాడల వాడలందుఁ బ్రతిభన్ గల కృష్ణునిఁ జెప్ప నేటికిన్.

3. ఉ॥ మా రమణార్యుఁ డన్నఁ దిరమా విలువన్ వచియించుచున్న నీ
తీరము చేసికొన్న సుకృతిన్ గద నేఁడిల లభ్యమయ్యె వా
గ్ధోరణి మేటి కావ్యముల ధోరణి జాహ్నవికిన్ సమానమై
శ్రీ రుచిరార్థమై తనరుఁ జేరిన మస్కృతు లాచరించెదన్.

4. ఉ॥ దైవము తెచ్చె మిమ్ము కవితాప్రియులార సుదారులార స
ద్భావరస ప్రధాన పరిభావితులార మహాత్ములార! వి
ద్యావరులార; పెక్కు విషయంబు లవేల? యదృష్టమంతు నీ
మావరశిష్యులెల్ల బహుమానము మీవలనన్ గ్రహింపఁగన్.

5. గీ॥ రామకృష్ణ శర్మాఖ్యుని నామమన్న
రామకృష్ణ శర్మాఖ్యుని నామమగును
ప్రతిపదంబును సార్థక పదము సుమ్మ
యిట్టి గడియార మెవ్వారికెట్లు దొరకు.

## అభినందన పత్రిక

6. గీ॥ నేఁటిసభయందు మాభాగ్య నియతివల్ల
నిట్టి కవి శేఖరులు లభియించినారు
రెండు సంద్రంబులేకమైయుండు రీతి
నెసఁగుచుండె నమస్కృతులిత్తు మేము.

7. గీ॥ ఉడుతభక్తిని వాక్పుష్పమిడితి మీకు
వేయి కానుకలనేవియుఁ బెట్టలేక
కానుకలెన్ని చెల్లించినంగాని మీదు
ఋణము జన్మశతాలకు నీగఁబోదు.

8. గీ॥ స్నేహలత చేసికొన్నట్టి సిద్ధియేమొ
నా కవిత్వగృహము పావనంబునయ్యె
ధన్యుఁడైతి సతీ సుతత్రయముతోడ
నింతకుమించు భాగ్యంబదేల? నాకు.

9. గీ॥ శిష్యతతికి దీవనములు చేర్పుమయ్య
ఆశిషంబులనిమ్ము విద్యార్థితతికి
కవుల వాక్కులే దిక్కు లోకములకెల్ల
రమణ కవిచంద్ర! పసిడి రామకృష్ణ!

కొల్లాపురము
11-7-52

ఇట్లు, కవిరాజ బుధమిత్ర
విధేయుఁడు,
**రా. సు. రాట్కవి**



# ప్రజలు ముఖ్యంగా తెలుసుకోవలసిన విషయాలు

రాష్ట్రంలో పడావా పడివున్న ౬౦ లక్షల ఎకరాల భూమిని సర్వేచేసి వెంటనే సాగుక్రిందికి తేవాలని కేంద్ర రాష్ట్ర మంత్రులు, ఉన్నతాధికారులు ఇటీవల హైదరాబాదులో సమావేశమై నిర్ణయించారు. అంతేగాక కేంద్రప్రభుత్వం యంత్రాలతో భూమిని సాగుచేయాలని ఒక కార్యక్రమాన్ని ఏర్పాటు చేస్తోంది. ఆ కార్యక్రమంలో చేర్చడానికై పదివేలేసి ఎకరాలు గల వ్యవసాయభూముల ప్రాంతాన్ని చూపెట్ట వలసిందని కేంద్రప్రభుత్వం హైదరాబాదు ప్రభుత్వాన్ని కోరింది.

... ... ...

పశుసంపద అభివృద్ధి కోసం ఒక శాసనాన్ని తయారు చేయడానికి హైద్రాబాదు ప్రభుత్వం అంగీకరించింది.

... ... ...

మహబూబ్‌నగర జిల్లాలో ౩౮ లక్షల రూ. ల ఖర్చుతో ఆరంభింప బడుతున్న చెరువుల మరమ్మతు వల్ల ౨౨ వేల ఎకరాల భూమికి నీటి పారుదల సౌకర్యం కలుగుతుంది.

... ... ...

తక్కావీపై ఆయిలు ఇంజనులు ఇవ్వడానికి ఒక కొత్త విధానం రూపొందించ బడింది. ఈ విధానంవల్ల ఇంజనుల మరమ్మతు చేసే విషయంలో రైతులకు కొన్ని గ్యారంటీ సౌకర్యాలు కల్పించబడ్డాయి. ఇప్పుడు నమూనా అభివృద్ధి ప్రణాళిక క్రింద ౫౩ ఆయిలు ఇంజనులు పనిచేస్తున్నవి. వివిధ ధాన్యాల మేలురకం విత్తనాలు, వేరుసెనగ పిండి, పచ్చి ఎరువుల విత్తనాలు, ఇతర రసాయనిక ఎరువులు రైతులకు అందజేయ బడుతున్నవి.

... ... ...

సరఫరా మంత్రి నల్లగొండజిల్లా, మిర్యాలగూడెం, హుజూరునగర్ తాలూకాలలో పర్యటించి అక్కడి ఆహార పరిస్థితిని స్వయంగా విచారించి తెలుసుకొని, గ్రామస్థులు ధాన్యాల సరఫరాకై పెట్టుకొన్న దరఖాస్తులపై అక్కడికక్కడే ఉత్తరువులు ఇచ్చి కోటాలు మంజూరు చేశారు. ఆ జిల్లాలో ప్రతి మూలకూ ఆహారధాన్యాలు రవాణా చేయబడుతూన్నవి. అవసరమైతే ఎన్ని టన్నులైనా నల్లగొండ జిల్లాకు సరఫరా చేయడానికి మంత్రిగారు సంసిద్ధులై ఉన్నారు.

... ... ...

గ్రామపునర్నిర్మాణ శాఖామంత్రి శ్రీ దేవీసింగ్ చౌహాన్‌గారు ఆలందులో రెండు వర్గాల చేనేత సంఘాల వారిమధ్య చాలా కాలంనుంచి గల విభేదాలను పరిష్కారం చేసి, సహకార సామరస్య భావాలను ఆచరణరీత్యా చూపెట్టారు.

... ... ...

మార్కెటింగు కమిటీల ద్వారా రైతులకు ఎరువులు, విత్తనాలు సరఫరా చేయడానికై ప్రతిపాదన చేస్తే ప్రభుత్వం శ్రద్ధగా పరిశీలించుతుందని గ్రామస్థులకు చెప్పారు.

... ... ...

గ్రామపునర్నిర్మాణంలో గ్రామ పారిశుధ్యం ముఖ్యమైనదని, ప్రజలు పురపాలక సంఘం వారితో సహకరించాలని కోరారు. హుజూరాబాదులో హైస్కూలు సైన్సుహాలులో మహాత్మాజీ విగ్రహావిష్కరణ చేస్తూ విద్యార్థులంతా బాపూజీ సత్యాహింసల సందేశాన్ని పాటించాలని విజ్ఞప్తి చేశారు.

... ... ...

వెనుకబడ్డ తరగతుల ట్రస్టుఫండుక్రింద ౨౬,౭౯౧ మంది విద్యార్థులకు ఉపకార వేతనము లివ్వబడ్డవి. ౧౯౫౦-౫౧ లో ఉపకార వేతనాలకు మొత్తం ౬,౭౨,౪౦౮ రూ. లు ఖర్చుపెట్టబడినవి. బీదరు, ఖమ్మం, నిలంగా, అహమద్‌పూర్, మధిర, జాల్నా, జోగిపేటలోని ఖాస్గీ హరిజన హాస్టళ్లకు ప్రభుత్వం ౯౯,౪౨౯ రూ. లు ఖర్చుచేసింది. వివిధ జిల్లాలలో నడుస్తున్న ట్రస్టుఫండు హాస్టళ్లకు గాను మొత్తం ౩,౫౧,౬౫౬ రూ. లు. ఖర్చు పెట్టబడ్డవి.

... ... ...

బిచ్చమెత్తుకోవడాన్ని అరికట్టి, సంఘంలో అపేప లేకుండా చేయడానికి సాంఘిక సేవా మంత్రి తీవ్రంగా యోచిస్తున్నారు. రకరకాల ముష్టివాళ్ల వివరాలను అంకెలతో సహా సేకరించి, వారికి కొన్ని వృత్తులు కల్పించాలనీ, అందుకవసరమైన డబ్బును

ధార్మిక సంస్థలనుంచి, ఇతరదాతలనుంచి ప్రభుత్వం నుంచి కొంత పోగుచేసి భిక్షుక గృహాలను తెరవడానికి ప్రయత్నాలు జరుగుతున్నవి.

... ... ...

ప్రజలకు సంబంధించిన షికాయతుల విషయంలో హైకోర్టుకు గాని, క్రింది కోర్టులకు గాని దాఖలు చేసుకొనే దరఖాస్తులకు కోర్టు ఫీజు స్టాంపు చెల్లించ నక్కరలేదని ౧౩౨౪ ఫసలీ హైద్రాబాదు కోర్టు రుసుం చట్టం నెం. ౭ తాలూకు ౨౫ వ దఫాలో సూచించ బడిన దరఖాస్తులకు కూడా స్టాంపు ఫీజు చెల్లించ నక్కరలేదనీ రెవిన్యూశాఖ ప్రకటన చేసింది.

... ... ...

ప్రభుత్వం ప్రతి అబ్కారీ చెట్టుకు, అది ఖాస్గీదైనా, ప్రభుత్వానిదైనా సరే, యజమాని రుసుమును నిర్ణయించాలని నిశ్చయించింది. చెట్టుయజమాని రుసుము అంటే హక్కేమాలికానా, చెట్టు పన్నులో నాల్గవ వంతుగా ప్రభుత్వం నిర్ణయించింది. దాన్ని వసూలుచేసి పట్టేదార్లకు, కౌలుదార్లకు వారిభాగాల ప్రకారం పంచి పెట్టడానికి రెవిన్యూశాఖ ఒక పద్ధతిని నిర్ణయిస్తూ ఉత్తర్వు చేసింది. ఆ ఉత్తర్వు 1952 అక్టోబరు 1వ తేదీనుంచి అమల్లోకి వస్తుంది.

... ... ...

హైదరాబాదు ప్రభుత్వం రాష్ట్రంలోకి దిగుమతి అయ్యే సరకులన్నిటిపై కరోడ్గిరీ మహసూలును రద్దు చేసింది. కాబట్టి గుడ్డలధరలు చాలా తగ్గిపోయ్యాయి. గుడ్డలు కొనేవారందరూ వాటిపై అచ్చువేయబడిన టెక్సు మార్కు వెలను చూచి ధర సక్రమంగా వున్నదీ లేనిదీ నిర్ధారణ చేసుకోవడం మంచిది.

... ... ...

1952 జూలై 27 వ తేదీ నుంచి గోధుమలపై రేషనింగ్ రద్దుచేయబడింది. 1952 ఆగస్టు 3 వ తేదీ నుంచి వరంగల్లు, ఖమ్మం, కొత్తగూడెం, బెల్లంపల్లి పాష్టీలలో రేషనింగు ఎత్తివేయ బడింది.

... ... ...

మహబూబునగర్, గద్వాల, జోగిపట్టణాలలో పబ్లిక్ కాల్ ఆఫీసులు తెరువబడ్డవి.

... ... ...

సికిందరాబాదులో జేమ్సు స్ట్రీటుకు మహాత్మా గాంధీ రోడ్డుఅనీ, అలెగ్జాండ్రా రోడ్డుకు సర్దార్ పటేల్ రోడ్డు అనీ కొత్తపేర్లు పెట్టబడ్డవి.

... ... ...

నిజామాబాదులో ౧౯౫౨ సెప్టెంబరు నెలనుంచి టెలిఫోన్ ఎక్స్చేంజీ తెరువబడుతుంది. నిజామాబాదు పురవాసులు ఇక తమ ఇండ్లలో టెలిఫోను కనెక్షన్ పెట్టుకోవచ్చు.

... ... ...

హైదరాబాదు ప్రభుత్వం వెనుకబడిన తరగతుల పట్టిక నొకదానిని ప్రకటించింది. అందులో ౫౨ కులాలు వెనుకబడిన తరగతులుగా పేర్కొనబడ్డవి. వీరికి ప్రత్యేక సౌకర్యాలు కల్పించబడుతాయి.

... ... ...

ఒక జిల్లాలో గ్రామాలమధ్య ఆహారధాన్యాల రవాణాపై గల నిర్బంధాలు ౧-౮-౧౯౫౨ నుంచి రద్దు చేయబడ్డాయి. 

(౨౨వ పేజీ తరువాయి)

గాలు! ద్రవ్యంతో సంబంధించిన జీవితాలేకాని మరేవీ లేదు. భారతదేశం ఇలా వుండడానికి కారణం యేమిటి? అంటే- యిక్కడి ఆర్థిక పరిస్థితి బొత్తిగ బాగుగా లేదని సమాధాన మిస్తారు కొందరు నాయకులు. హాస్పిటలుకు, నాకు మల్లేనే వచ్చే ప్రతివ్యక్తికి ఆమె మందు లిస్తోంది. చేతులు పట్టు కోని సూదులు గుచ్చుతోంది. తీవ్రంగా చూస్తూంది ప్రతివ్యక్తిని, యింత వరకు ఆమె జీవితంలో పురుషుణ్ని చూడనట్టు. ఎంత ఆమె తన తృష్ణను తీర్చుకోగల్గుతున్నా "తనదీ" అనే వస్తువు లేకపోవడంవల్ల అలా కంగారు పడుతోంది కాబోలు అని గ్రహించాను. ఆమెను కలుసుకున్నాను. మాటల ధోరణిలో అన్నాను. "చాలా ప్రశాంత జీవితముండి మీది" అని. 'వెధవ జీవితం, వెధవ ఉద్యోగమండి. కేవలం ఉదర పోషణార్థం చేసే పని" అంది నిరుత్సాహంగా! అందుకే ప్రాస్తున్నాను నీకు, లేకపోతే వెంటనే విమర్శించుతావు: దేశంలోని తనతోటి సోదరులకు ఆమె సేవచేస్తూంటే బ్రహ్మచారుల తృష్ణను తీర్చుతూ వుంటే, నీవు చూడలేనట్లున్నావని.

నా వుద్దేశ్యం భారతీయులలో యీ దరిద్రబాధ పూర్తిగా పోనంతవరకు. సమత్వం యేర్పడనంతవరకూ తిండి దొంగలంతా కార్మికులుగా, కర్షకులుగా మారనంత వరకు మీ దొరసానులంతా మామూలు భారత స్త్రీలయేంత వరకు, భారతదేశానికి లభించిన స్వాతంత్ర్యం స్వాతంత్ర్య మనిపించుకోదు. మరి శెలవు.

# ఉత్తరాలు - 7 

"మూర్తి"

వ— దగ్గరనుంచి జాబువచ్చి నన్ను చాలా కలవరపెట్టింది. ఆమె శరీరపరిస్థితి ఏమీ బాగాలేదట. పైగా 'నేను జీవించ దలచుకోలేదు, నా కోరిక భగవంతునికి కూడా ఇష్టమే నేమో' అని కూడా వ్రాసింది ఒకచోట. ఏం చేయను? ఆమె అలా వ్రాయటం ఆమెకు చాలా సులభంగా వున్నది కామోను. పిచ్చిమనిషి. ఆ రెండు ముక్కలూ నా హృదయకవాటాన్ని ఛేదిస్తవని గమనించ లేదు. ఆమె లేకపోయిన తర్వాత నేనేమిటి, మరి నా ప్రత్యేకత యేమిటి? ఆ జాబు చూచుకుని చాలా బాధపడ్డాను, గాని యేమిచేయను? బాధపడడం కూడా వెర్రితనంగానే తోచింది నాకు. మూడు నెలలనుండి వ్యాధితో బాధించిపోతోంది. ఔషధానికి బొత్తిగా పైకం లేదాయె, ఏం చేయను? మా విచారం ఎవరికి గావాలి, మా విషాద జీవితాన్ని ఎవరు చూస్తారు? ఎవరు మాకు సహాయం చేయగలుగుతారు? ప్రతివ్యక్తి తన సౌఖ్యం వరకే గను ఆలోచించుకుంటాడు. ఈలాటి హీనమైన దేశంలో మానవజన్మ యెత్తిన దానికంటే పశువై పుట్టడం బాగేమో అని ఆలోచించుకుంటాను.

నీ జాబులు బాగా వున్నాయి. అచ్చువేయిస్తానన్నావు తెలుసా! ఏం చేస్తాయి ఈ జాబులు? కొద్దిరోజులు జోరుగా కాపీలు అమ్ముడు పోతాయి. తర్వాత ఏ కుంకుమ పొట్లాల కొరకో ఉపయోగింపబడతాయి. ఏ గ్రంథం ఎవరిని కలవర పెట్టింది. మహాత్ముని గ్రంథాలు ఏం బ్లాకుమార్కెట్టును నిర్మూలించాయా? రాధాకృష్ణ పండితుని గ్రంథాలు ఏం వేదాంతాన్ని బోధించగలిగాయి? 'భేష్! చాలా గొప్ప రచయిత' అంటారు. అంతే అతని రచనలో అతను ఇమిడ్చిన భావాలు అతని హృదయకుహరాన్ని భేదించుకొని వచ్చినవని గ్రహించరు. కవిత్వంఅంటే, రచన అంటే కవి జీవితపు ప్రతిబింబమని గ్రహించరు. అతని రచనలో గల ఆదర్శాన్ని చూడనైనా చూడరు. పైగా దరిద్రఘోష అంటారు, ధనమదం యెక్కిన కవులు కొందరు. దారిద్ర్యం వల్ల సహజంగా వుండవలసిన ఆత్మగౌరవాన్ని కూడా వదులుకుంటాడు వ్యక్తి. ఆ దారిద్ర్యబాధే అతన్ని అలా తయారు చేస్తుంది. సహజమైన సౌందర్యం నశిస్తుంది కొన్ని వేళల్లో. మనలో ఇంకో జాడ్యం వుంది- ప్రతి దరిద్రుడూ అత్యున్నత స్థితికి రావలెనని తన యథార్థాన్ని మరచిపోతాడు కొన్ని సమయాలలో.

నిన్న నేను హాస్పిటలుకు వెళ్ళాను, నెత్తురు పరీక్ష కొరకు. ఒక హైందవ స్త్రీ వచ్చింది నాదగ్గరకి, రక్తం తీసేందుకు. తెల్లటివేషం వేసుకుని పావురానికి మల్లే వుంది. ముఖానికి తిలకం గిలకం ఏమీలేదు. మైదానం వలె వుంది నుదురు. బాగా బలిసిన కండరాలు, చక్కని వక్షస్థలం. చాలా అందంగా వుంది మనిషి. అల్లరి కళ్లు, చిన్నగడ్డం, దానిపక్కనే పులిపిరి. బాగా వుంది మనిషిమాత్రం. అటుతరువాత తెలుసుకున్నాను ఆమె అవివాహిత అనికూడా. ఈ దరిద్రబాధకు తాళలేక కొద్దిగా చదువుకుని ఉద్యోగంలో ప్రవేశించింది. ఉదరనిమిత్తం తన మతాన్ని వదులుకొంది. వివాహంకూడా చేసుకోలేదు. ఆమెలో ఉప్పొంగే మధురభావాలు; పూర్ణిమచంద్రుడ్ని చూచిన తర్వాత ఆమెలో ఉత్పన్నమయ్యే మధురమైన కోర్కెలు, ఆమె యౌవనం అలా నాశనం కావలసిందేగా! లేదా! ఏ కరకు తురక డాక్టరుకో బలి చేయాలి ఆ సౌందర్యాన్ని. ఆలోచించు- మీలో ఎవరైనా అవివాహితలై యున్నారా? అలా కూటికొరకు ఉద్యోగం చేస్తున్నప్పటికీ చాలామంది తమ నీతిని గోల్పోరు. అయినప్పటికీ లోకం శంకిస్తూనే వుంటుంది నారిని. లోకాన్ని అనుసరించి వారుకూడా అలాగే తయారవుతారు. మరి ఏం చేయగలుగుతారు? ఉద్యోగం మానుకుంటే జీవితమే భారమై పోతుంది. సరే, ఇలాగే వుండి స్వేచ్ఛాజీవితం హాయిగా నడుపుదామూ అంటే ఆమె మీద ప్రతిడాక్టరుకు అధికారమే ఆయెను. ప్రతివ్యక్తి అనుభవిస్తాడు ఆమెను. ఆమె నిరాకరిస్తే పగసాధిస్తాడు. ఆమె జీవితాన్ని భగ్నం చేస్తాడు. అంతకూ లొంగకపోతే ద్రవ్యం మచ్చు చల్లుతాడు. ఏం జీవితాలు పరాధీనమైన కళేబ

(మిగతా ౩౦వ పేజీలో)

పద్యావళి :

# ఆత్మప్రీతి

**శ్రీ వేదాన్తం అంగీరసయ్య**

కం॥ కలడొక భూసురుడిల నిస్తుల భాగ్యకళాపరిపూర్ణ । తుహినద్యుతియై ।
తలపం బుణ్యుల బుధులట । సులలిత ప్రియదారయంట । సుకృతికతనికిన్॥ ౧

కం॥ ఇహసుఖముల జెక్కులప । ద్విహితపథంబునను గుడిచి । విప్రోత్తముడున్ ।
మహిగాంచె సమానులలో । రహినుత్తము దనెడికీర్తి । గాముని కరుణన్॥ ౨

కం॥ ఇరవుగ నిటులుండి యతం । డొరవుగ తాళంపుజెవుల । యొకనుత్తిమొలన్ ।
ధరియించి యరిగె తత్పుర । పరిసరవని నున్నయోగి । పదుసేవింపన్॥ ౩

కం॥ ఆ కానన మధ్యంబున । నేకాంత నివాసి యొక్క । ఋషివరు సాక్షాత్ ।
స్వీకృత వేద శరీరుని । బ్రాహ్మణ్యమెసంగ గాంచి । ప్రణతియొనర్పన్॥ ౪

కం॥ నారాయణన స్మృతి యతి । వారక నొనరింపంగేస్తు । పరమప్రీతిన్ ।
చేరంజని యోస్వామీ । మీరి నను బోధదల్ప । మేకొనుడనియెన్॥ ౫

కం॥ అదివిని ముని పరిగానీ । ఇదియేమి వచింపు మినుప । పీముక్కలిటుల్ ।
గుదిగూర్చి మొలను దాల్చితి । విదియొక భూషణమొ బోధ । కిదిసాధనమో॥ ౬

కం॥ అనిపం గృహియనె నివి మ । ద్ధనపేటుల బదిలపఱపు । తాళంపుజెవుల్ ।
మునివర యివిమత్పుత్రుల । గొనుడని సెప్పితివిగాని । గొన నేమందున్॥ ౭

కం॥ ఇదియొకటి యేమి యింటికి । యెదిద్దియైనను గానిదెచ్చి । యే నిడుదనుకన్ ।
మెదలరు ప్రేమను నాయీ । తదనంతర మెట్లొగాని । దారసుతాదుల్॥ ౮

కం॥ యతిపతి యామాటలువిని । యతినిపుణుడ వెరుగలేవె । యాలియు సుతులున్ ।
ధృతినిన్ను బంటుభంగిని । సతతము బనిగొనుట ప్రేమ। సగణియో యనియెన్॥ ౯

కం॥ నావుడు గృహవ్రతుండను । భావన నా ప్రాణములను । ప్రాణంబులుగా ।
ఆవిధిప ర్తిలు వారల । నీవిధి దుష్కృతిని । యూరనపలనే॥ ౧౦

కం॥ అనవుడు గురు డేదియిక । గనుగొందము నిజము యింటి । కదకేగి వసం ।
బున పాము గరచెనని బడి । వినుమే నటు వచ్చిబిలచు । నెక్కను లెమ్మా॥ ౧౧

కం॥ వల్లెయని శిష్యుడింటికి । నల్లనజని సర్పదష్టు । డటు నేలబడన్ ।
గొల్లుమని రొక్కపెట్టున । ఇల్లాలును బిల్లలేమి । యూశ్వాసయించున్॥ ౧౨

కం॥ పురజనులెల్లరు వచ్చిరి । బిరబిర వైద్యులను మంత్ర । వేత్తలు వచటన్ ।
బఱపు ప్రతిక్రియలన్నియు । నరయగ భప్నంబునందు । హవ్యములయ్యెన్॥ ౧౩

కం॥ అందుకొనెగురక ముఖమున । గ్రందుగ ఫేనంబు లంత । కంతకు మిగిలెన్ ।
రొందను రోగంబొక్కటి । మందొక్కటి యైన నెట్లు । మాటలు దక్కన్॥ ౧౪

కం॥ చిత్తములు విసువ దైవా । యత్తంబిక నంచు వెజ్జు । లాడి జనంగన్ ।
మొత్తముగనచట బంధువు । లత్తఱి విలపించిరెంత । యాయోగతులన్॥ ౧౫

కం॥ ఎంతటిపాపిని యిటు జె । ట్టెంతటినిను ప్రమింగకొంటి । నయ్యో కొడకా ।
అంతకుడు నన్నుగొని ని । న్నింతట విడువండె జనని । నింకేమికనెన్॥ ౧౬

కం॥ పోరుం బొక్కను లేకను । గూరిమి మనమున్న గన్ను । గుబ్బైనె విధికిన్ ।
జేరదనహగలినిశ్నే । నారయునడ్డం బికెవ్వ । రని యాలనియెన్॥ ౧౭

